# ఉగాది

శ్రీ రామా బుక్ డిపో
విద్యావిషయిక ప్రచారకులు,
మార్కెటువీధి, శికిందాబాదు-దక్కన్.



మ॥శ్రీ. పద్మా శంకరయ్య శ్రేష్ఠిగారు, శికింద్రాబాదు.




శ్రీరామా బుక్ డిపో వారి ఉద్యోగులు.

# పీఠిక

ప్రపంచమునందలి సమస్త జీవరాసులలోను మానవున కున్నతస్థానమిప్పించిన సాధనములలో భాష ప్రధానమైనది. భాషయే లేనియెడల మానవులు తమ యనుభవములను, అభిప్రాయములను, పరస్పరము వినిమయము చేసికొనుట యసాధ్యమై యుండెడిది. భాష యొక్క యభివృద్ధిపైననే నాగరికత యొక్కయు, సంస్కృతి యొక్కయు, వికాస మాధారపడియుండును. కనుకనే భాషాసేవ సేయు కవి పండిత లోకమును, తత్పోషకమగు కృతిపతి, కృతిప్రకాశక వర్గమును జనుల ప్రశంసలకు పాత్రములగుచు చిరతరకీర్తి నందుచున్నవి.

కాగా, "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని ప్రసిద్ధివడసిన యాంధ్రభాష కిటీవల కొన్ని శతాబ్దముల నుండి రాజకీయార్థిక కారణములవలన మన తెలంగాణమునఁ దగినంత యాదరాభిమానాభ్యాసములు లేకుండుటచే నది కొంత వెనుకఁబడియున్నది. పూర్వకాలమున రాజులు, జమీందారులు మున్నగు నధికారవర్గముపై నిలచియుండిన భాషాప్రోత్సాహక కార్యభారము యంత్రయుగమని చెప్పబడుచున్న నేటికాలమున గ్రంథప్రకాశకులపై మోపఁబడి యున్నదనుట సత్యదూరము కాదు. అట్టిభారమును వహించి, కార్యసాఫల్యమును గలుగఁ

జేయుటకై వ్యక్తికి కొన్ని యోగ్యతలు కావలసియున్నవి. వానిలో రసజ్ఞత, వివేకము, ఐశ్వర్యము, ఇవి యత్యవసరము. సాధారణముగా నేయొక వ్యక్తియందైనను నీ సద్గుణత్రయ సమ్మేళన ముండుటఁ గానము. కాని యట్టి యరుదైన యభ్యుదయశీలురలో ప్రస్తుత గ్రంథప్రకాశకులగు శ్రీ పబ్బా శంకరయ్యశ్రేష్ఠిగా రొకరనుట యతిశయోక్తి కాజాలదు.

వీరు లాల్‌బజారు వాస్తవ్యులగు కీ॥ శే॥ పబ్బా శివరాజయ్యగారి యేకైకపుత్రులు; పాతబజారు కాపురస్థులగు కీ॥ శే॥ చందా రామన్నగారి మేనల్లుఁడు; మార్కెటు వీధియందలి శ్రీరామా బుక్‌డిపో యజమానులు. వీరికి తలిదండ్రులు చిన్నతనముననే కఱవగుటచే, మేనమామ రామన్నగారాయనను చేరఁదీసి పెంచుటయేగాక, యావత్సంపదకూడ తన చిన్నకుమార్తె నతనికిచ్చి వివాహము చేయవలసినదిగా వీలునామా వ్రాసియుండెను.

ఈ చందా రామన్నశ్రేష్ఠిగారానాటి సికింద్రాబాదు వర్తకశ్రేష్ఠులలో నొకరు. మహాకవి శిరోమణి బ్రహ్మశ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారిచే ప్రకటింపఁబడిన "దివ్యవాణి" పత్రికా ప్రథమ విజయసంచికలో నిట్లు వ్రాయఁబడియున్నది.

"కీ॥ శే॥ చందా రామన్నశ్రేష్ఠిగారు:- వీరు వర్తకప్రముఖులు. ఉదారులు. దేవబ్రాహ్మణ

భక్తియుక్తులు. దీనదయాళువు. సత్కార్యములకు శక్తికిమించిన సహాయముగూడ జేయ నుంకించెడి వారు......................"

వీరు హరికథలు, పురాణములు, మొదలగు సత్కాలక్షేపముల నెన్నిటినో యేర్పాటు చేయించుచుండెడి వారట. నిరతాన్నదానములతో, భూరిదక్షిణలతో, సర్వభూత సంతృప్తిగా పూర్వపు పద్ధతిలో మహావైభవముగా జరిపిన వివాహములలో శ్రీ రామన్న శ్రేష్ఠిగారు తన జ్యేష్ఠ పుత్రిక శ్రీమతి భాగమ్మగారికి జరిపిన వివాహమే సికింద్రాబాదు నగరమున చిట్టచివరిదని చెప్పుదురు.

ఈ మహనీయునియందు తనకుగల ప్రేమను, కృతజ్ఞతను వెలిబుచ్చుటకును, ఆయనపేరును చిరస్థాయిగా నిలుపుటకును శ్రీ శంకరయ్య శ్రేష్ఠిగారు శ్రీరామా బుక్ డిపోను స్థాపించి నడుపుచుండుటయేగాక, తన సద్గుణములను, ఐశ్వర్యమును వినియోగించి, ఎన్నియో సత్కార్యములు చేయుచున్నారు. "భారతాభ్యుదయము" అను సనాతన ధార్మిక గ్రంథమును ముద్రింపించి ప్రకటించుటతోబాటు, కొన్ని సంవత్సరములుగా ప్రతి వత్సరాదియందును కవి పండిత సన్మానము యథాశక్తి జరుపుచున్నారు. ఉగాది తెలుగువారికి మిక్కిలి ముఖ్యమైన పండుగ. ఆనాడెంత సుఖముగ, ఆనందముగ గడపిన సంవత్సరమంతయు నట్లే సుఖముగ, ఆనందముగ గడుపనగునని విశ్వసింపబడుచున్నది. కావున నూతన

వత్సరాదియందు పంచాంగశ్రవణము, కవిపండిత సన్మా
నము మున్నగు కార్యకలాపము జరుపుటెంతో సంతోష
కరమైన విషయము. ఈ నగరమున నీ సత్కార్యక్రమ
మును జరుపుటకు శ్రీ శంకరయ్యశ్రేష్ఠిగారు ముందంజ
వేయుట వారి వివేకమును, రసజ్ఞతను చాటుచున్నది.
ఉగాది సమయములం దిట్లావిర్భూతమైన సరస రచనల
సంపుటియే ప్రస్తుత గ్రంథము. ఈ రచనలయందలి
వైదగ్ధ్యమును, విశిష్టతను గూర్చి యిట వేరే చెప్పనక్కఱ
లేదు. ఇట్టి రచనల నావిష్కరించు నవకాశమును కవి
పండితులకును, విని యానందించు నవకాశమును పుర
జనులకును ప్రతి ఉగాదియందును కలుగఁజేయు
చున్నందులకు శ్రీ శంకరయ్యశ్రేష్ఠిగా రెంతయు నభినంద
నీయులు. శ్రీ శ్రేష్ఠిగారి నిట్టి సత్కార్యముల నొనర్చుటకై
ప్రోత్సహించుచు, వారికి సర్వవిధముల సహాయసంపద
నొసంగుచున్న మహాకవి శిరోమణి బ్రహ్మశ్రీ చివుకుల
అప్పయ్యశాస్త్రిగారును, శ్రీరామా బుక్‌డిపో మేనేజరగు
మహారాజశ్రీ నీలా రాజయ్య గుప్తగారును యెంతయు
ప్రశంసాపాత్రులు.

పురజనులయొక్కయు, ప్రభుత్వమువారి యొక్కయు
ఆదరాభిమానములతో శ్రీరామా బుక్‌డిపో దినదినాభివృద్ధి
నందునట్లును, తద్యజమానులగు శ్రీ పబ్బా శంకరయ్య
శ్రేష్ఠిగా రితోధికముగా సత్కార్యములను నల్పుచు
"స్వస్థాన వేషభాషాభిమతస్సంతో... రసప్రలుబ్ధధియః"

అను ఆర్యోక్తి కుదాహరణపాత్రులై "ఉత్తమస్సహా నానాం" అను శ్రుత్యుక్త్యనుసారము సాటివారందరిలో మేటిమై చిరకాలము వర్ధిల్లునట్లును, సజ్జనరక్షకుడగు పరమేశ్వరుఁ డనుగ్రహించుగాక!

| 24-3-52.<br>సికింద్రాబాదు,<br>(దక్షిణ) | } | నాగం కృష్ణారావు,<br>వైద్యవిశారద. |
|---|---|---|

## ఆశీ ప్రార్థనం

మూడవ ఏప్రిల్ 1946 (వ్యయసంవత్సరాది) నుండి వరుసగా ప్రతి ఉగాదినాడును శ్రీరామా బుక్‌డిపో యజమానులు సారస్వతోత్సవములు జరుపుచు పండిత సన్మానము చేయుచున్నారు. స్థానిక పరస్థానిక కవులు, పండితులు ఆ సమావేశములలో పాల్గొని కవితాగోష్ఠి చేయుచు సంబరపడుట ఆచారమై పోయినది; నూతన సంవత్సరమును ఈ విధముగా ఆహ్వానించుట ఎన్నదగినదే.

ఇదేవిధముగా ప్రతి సంవత్సరమును ఇతోధికముగా పండిత సమ్మానమును, భాషాసేవను చేయుచుందురని ఆశించుచున్నాను. ఈ సమయములలో చదువబడు పద్యమాలికలను గ్రంథరూపమున వెలువరించుట మరియు సంతోషకరమైన విషయము. ఇట్టి గ్రంథమును మనఃపూర్వకముగ ఆహ్వానించుచున్నాను.

ఇల్లిందల సీతారామరావు,
(సెక్రటరీ, బోర్డు ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషను),
హైదరాబాదు (దక్కన్), 18—3—1952.

శ్రీ

# ఉగాది పిలుపు

## వ్యయ సంవత్సరాది

## 3—4—1946

★

అధ్యక్షులు.

**ఆచార్య, రాయప్రోలు సుబ్బారావుగారు,**

ఉస్మానియా యూనివర్సిటీ. హైదరాబాద్.

★

కార్యకర్తలు.

**శ్రీరామా బుక్ డిపో,**

విద్యావిషయక ప్రచారకులు,

మార్కెట్ స్ట్రీట్ — సికంద్రాబాదు.

# అభిప్రాయము

---

మూడవ ఏప్రిల్ 1946 (వ్యయసంవత్సరాది) నుండి వరుసగా ప్రతి ఉగాదినాడును శ్రీరామా బుక్‌డిపో యజమానులు సారస్వతోత్సవములు జరుపుచు పండిత సన్మానము చేయుచున్నారు. స్థానిక పరస్థానిక కవులు, పండితులు ఆ సమావేశములలో పాల్గొని కవితాగోష్ఠి చేయుచు సంబరపడుట ఆచారమై పోయినది; నూతన సంవత్సరమును ఈ విధముగా ఆహ్వానించుట ఎన్నదగినదే.

ఇదేవిధముగా ప్రతి సంవత్సరమును ఇతోధికముగా పండిత సమ్మానమును, భాషాసేవను చేయుచుందురని ఆసించుచున్నాను. ఈ సమయములలో చదువబడు పద్యమాలికలను గ్రంథరూపమున వెలువరించుట మరియు సంతోషకరమైన విషయము. ఇట్టి గ్రంథమును మనఃపూర్వకముగ ఆహ్వానించుచున్నాను.

ఇల్లిందల సీతారామరావు,
(సెక్రటరీ, బోర్డు అఫ్ సెకండరీ ఎడ్యుకేషను),
హైదరాబాదు (దక్కన్), 18—3—1952.

శ్రీ

# ఉగాది పిలుపు

## వ్యయ సంవత్సరాది

## 3—4—1946

★

అధ్యక్షులు:

**ఆచార్య, రాయప్రోలు సుబ్బారావుగారు,**

ఉస్మానియా యూనివర్శిటి. హైదరాబాద్.

★

కార్యకర్తలు:

**శ్రీ రామా బుక్ డిపో,**

విద్యావిషయిక ప్రచారకులు,

మార్కెట్ స్ట్రీట్ — సికంద్రాబాదు.

# ఉగాది

సికిందరాబాదు మార్కెటుబజారులోని శ్రీరామా బుక్ డిపోవారి యాజమాన్యమున ఉదయము వారిదుకాణము వద్ద ఉగాదిపూజయును, క్రొత్తలెక్క పుస్తకముల ప్రారంభమును, ఆగతమహాజన సన్మానమును చేయబడినవి. శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయమున 3—4—46 తేది సాయంకాలము 5-30 గంటలనుండి సభ సమావేశము య్యెను. పండితులు, వర్తకప్రముఖులు, పౌరులు దాదాపు 300 మంది వచ్చిరి. తొలుత దైవప్రార్థన యైన తరువాత బ్ర॥శ్రీ సహజకవి నారాయణం రాజనరసింహ శాస్త్రిగారిచే పంచాంగశ్రవణ మానందజనకముగా చేయు బడెను. పిమ్మట శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారాయ భట్టాచార్యులవా రధ్యక్షత వహించి ఆంధ్రుల యౌన్నత్య ప్రతిభా, సామర్ధ్య, వైదుష్యములను గొంత పేర్కొని మన సికింద్రాబాదు నగరమునందీ మహోత్సవ మపూర్వ ముగా జరుపబడుచున్నది. దీనివలన గవులును. పండితు లును, దైవజ్ఞులును మహోత్సాహభరితు లగుచున్నారు. ఆంధ్రభాషకును, ఆంధ్రులయందు పరస్పర సౌహార్ద్ర సాహాయ్యాదులను నెలకొల్పుటకు నివి చాల ప్రోత్సాహ కరము లగుచున్నవి. వీనిని జరుప ప్రారంభించిన శ్రీరామా బుక్ డిపో వారెంతయు ప్రశంసనీయులు. వివి

సత్సంకల్ప ముత్తరోత్తరాభివృద్ధి జెందుగాక! యను సూక్తులతో ప్రారంభోపన్యాసము గావించిరి. విద్వాన్ వెల్లంకి వేంకటరమణయ్య, నాగం కృష్ణారావు, భీమవరపు సాంబశివశర్మ, సూరి నరసింహమూర్తి మున్నగు కవులు ఉగాదినిగూర్చి పద్యములం జదివిరి. విద్వాన్ జె. అమరనాథశాస్త్రి, చిల్లా సుబ్బరాయ సిద్ధాంతిగార్లు ధార్మికప్రబోధము, పంచాంగ రచనలంగూర్చి యుపన్యసించిరి. శ్రీ ధర్మరంజన్ వంగపల్లి నీలకంఠశ్రేష్ఠిగారు ధర్మాచరణావశ్యకతనుగురించి కొంత ముచ్చటించి, యీ సభా సమావేశమున కానందించిరి. పై పండిత, కవి ధర్మసేవకులను వస్త్రాదులతో శ్రీరామా బుక్ డిపో ప్రొప్రైటరు పబ్బా శంకరయ్యశ్రేష్ఠి, మానేజరు నీలా రాజయ్యగుప్త గార్లు సన్మానముగావించి తదాశీఃపాత్రులైరి. అధ్యక్షోపసంహారోపన్యాస మయినపిమ్మట కార్యదర్శి శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములతో రాత్రి 9 గంటలకు సభ సంపూర్ణమాయెను. కొన్ని పంచాంగములు ఉచితముగా పంచిపెట్టబడెను.

## శ్రీ నాగం కృష్ణరావు గారు
సికింద్రాబాదు

౧

మ॥ జయనాదంబులు భారతీయజన వాం
ఛాపూర్తిఁ గావింప, న
వ్యయసౌఖ్యంబు నొసంగు ధర్మకలనా
వ్యాపార మేపారఁగా
వ్యయమైపోవ నధర్మ మెంతయును, ని
త్యానంద సంధాయియై
వ్యయ సంవత్సర మేగుదెంచెఁగద, దృ
క్పర్వంబు సర్వంబునై.

౨

సీ॥ వైదికాచారసంపత్తి భారతభూమి
విజ్ఞానవంతమై వెలయుఁగాత
క్షాత్రమహాదీప్తి సాహసోద్వృత్తులు
ధర్మరక్షణయందుఁ దనరుగాత
అర్థ, సామ్రాజ్య మహాధిపత్యస్ఫూర్తి
భవ్యవైభవములు ప్రబలుగాఁత
చెలరేగుకామాది బలమైనదోషముల్
హలముఖాత్త విభూతిఁ దొలఁగుఁగాత!

గీ॥ అవని ద్విజరాజ వైశ్య శూద్రాదిజనము
నిజకులోచిత వ్యాపార నియతిఁగలిగి
ఐహికాధ్యాత్మ భూరి సౌఖ్యానుభూతి
నిర్భరానందమహిమచే నెగడుఁగాత.

౩

ఉ॥ దేనిగుఱించి నిశ్చితము
లెన్ గడు ఘోరరణంబొనర్చిరో
దానితలంపుడీరు పెడ
దారులఁ బోవుటపాడియే, పరా
ధీనములైనదేశముల
దీనతఁబాపఁగ శాంతిఁగూర్పఁగా
మానుగజేయుపాంతె, నను
మానములెందుకు లోకనాయకుల్.

౪

శా॥ అక్షీణంబగు కల్మిబల్మియును, వి
ద్యాబుద్ధులున్ రాజ్యసం
రక్షాదక్షతఁ గల్గువారు దమసా
మ్రాజ్యంబుఁ గైకొంటకై
"భిక్షాందేహి" యటంచు వేడుదురె దో
ర్వీర్యంబుఁ జూపింపరే,
దీక్షాసక్తిఁ గలట్టివారలకు, సం
దేహంబె, సంసిద్ధికిన్.

౫

మ॥ శతమన్యుప్రతిభావిలాసుని, సదా
చారున్ సుధీలోకస
న్నుతు, సద్వర్తనశీలు, సిద్ధగుణు, రా
మాబుకోడిపో సాపుకున్
బలియున్ బండిత పోషకుండయిన ప
బ్బాశంకరున్ శంకరుం
డతులైశ్వర్య పరంపరాన్వితునిగా
నత్యంతముం జేయుతన్.

## విద్వాన్ వెల్లంకి వెంకటరమణయ్యగారు

సికింద్రాబాదు

౧

గీ॥ స్వాధికారవ్యయంబు దుర్వారమంచు
కడలికడలందు ఘోషింపఁ దొడఁగెపార్థి
వోత్తముఁడు భారతమున కాంధ్రోర్వికిని శు
భంబెలర్చెడి, వ్యయరిపు వ్యయమనంగ.

౨

చ॥ మనసున కుంభకోణమును మాన్యతఁ బైకొని గానుపింప దు
ర్జనజనసంగతిన్ విడువజాలని పార్థివు డిప్పు డెద్దియో
మనకు వ్యయంబుజేరునని మాటికిదెల్పుచుఁ బోవజూచెడి
తనిపరిపాలనంబు కడుదారుణమయ్యెను మాతృభూమికిన్.

3

మ॥ ఇదిగో చూపునకింతమేరగలదీ యేడాదిలో నవ్వదేస్
గదిసెన్ నీకు వసంతమింక కొదువల్ గల్పింప నౌనంచు బ
ల్కెదృఢోక్తిన్ మనకో యుగాదికిని దల్లిం బిల్ల నమ్మింగబో
వదు సస్యోచిత ప్రావృడంబుదము దెప్పాటైన గ్రీష్మంబగున్.

---

## ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు

★ సికింద్రాబాదు

౧

కం॥ శ్రీకరమై, సకలశుభ ప
శీకరమై నిరుపమాన శిష్టజనానం
దాకరమై, వెలయుత కరు
ణాకరుడగు శ్రీశుకృపను వ్యయవర్షమిలన్.

౨

ఉ॥ అటముబాంబు భీతియును అంతకుమించిన
ఘోరమైన యా
ఘాటకపున్గరోరతయు గల్పనజేసి జగంబునెంతొ యా
ర్భాటములోన ముంచి చనె పార్థివుడో వ్యయ !
నీవు తత్క్రియా
పాటవమున్ వ్యయించి సుఖభాగ్యము గూర్పగదే
ధరిత్రికిన్.

3

గీ॥ అరయ పాశ్చాత్య విద్యాశిశిరునిచేత
అకురాల్పంగ బడియున్న ఆర్షమత సు
వృక్షమా! 'వ్యయ' మాధవుకృపను చిగురు
తొడిగి ఫలవంతమై, శాంతి నిడెదుగాత !

గీ॥ ఆంధ్రులన్న నలసు లనుకరణప్రియు
లైకమత్యరహితు లనెడు నింద
తొలగజేసి యాంధ్ర బలముద్ధరింపుమా !
అరిజలవ్యయా ! వ్యయాబ్దనాథ !

## —• ఉగాది పదము. •—

పాడవే నీపాట పాడవే చెల్లెలా
వేడితో ఉడికేటి విశ్వంబు చల్లపడ ॥పాడవే॥
వీడరా నీబాట వీడరా తమ్ముడా
హింసతో సకలంబు ధ్వంసమగుపోరాట ॥పాడరా॥
కూడు గుడ్డలు లేక ఘోషింపగా ప్రజల్
నాగరక యంత్రంబు నడచేసు వంకర ॥పాడవే॥
అర్థతంత్రాలతో అడుగంటె సంపత్తు
రాజ్యాంగ మంత్రాల రక్తపాతములొత్తి ॥వీడరా॥
కొమ్మలను చెడగొట్టి కోకిలల పడనెట్టి
మాలితోటలుకూల్చి మసిచేయుటకుముందె ॥పాడవే॥
స్నేహభాండముపగిలి నీతిదీపములారి
మానవులు పశువులై మాఋమసలకమున్నె ॥పాడవే॥
అణువు ముక్కలుజేసి అతిభయంకరమైన
ఆపత్తుతెచ్చావు అనపరాధులకెల్ల
నీజీవరక్తములు న్మాలి క్షీరముగ
ఇచ్చిపెంచిన సంతు పుచ్చిపాలిపోకుండ ॥పాడవే॥
కానలో కడలిలో గాలిలో ఎగిరేవు
మనసు లీసున కుళ్ళ మాటమోసములుండు ॥వీడరా॥

———

## శ్రీ సూరి లక్ష్మీనరసింహమూర్తిగారు

సికింద్రాబాదు

★

౧

ఉ॥ ఆగమ శాస్త్రనిర్మిత మహత్తర కాలవిభాగచక్రమం
దాగతమైన నూతన సహాయక తత్త్వమెఱుంగ గోరి య
భ్యాగతులైన ధార్మికసభాసదులిచ్చుట నీకు నేడు సు
స్వాగతమిచ్చువారు మనసారగ శ్రీవ్యయనామవర్షమా.

౨

ఉ॥ పార్థివ వత్సరంబు చనె భండనకేళికి స్వస్తిచెప్పి కా
మ్యార్థములెన్నియో కరతలామలకంబు నటన్న
యాశలన్
వ్యర్థమొనర్పకుండ జనవాంఛిత సౌఖ్య
మొసంగి ప్రోవ న
భ్యర్థన చేయువారము వ్యయాబ్దము గూర్చి
యశేషభక్తితోన్.

3

మ॥ వ్యయమే చూపె నసెంబ్లిబడ్జెటు వృథా
వ్యాపార సంఖ్యావళిన్
వ్యయమే చూపిరి ధాన్యరాసులును రాజ్యాహార
వైజ్ఞానికుల్
వ్యయనామార్థ మపార్థమౌనటుల నీ
వ్యాఘాతముల్ మాన్పి య
క్షయమౌ శాంతినొసంగవే యెదము రక్షాదక్షుడౌ
యీశ్వరున్.

## శ్రీ॥ సాంబశివశర్మ గారు

సికింద్రాబాదు

౧

శ్రీమన్నాముఁడు, సుగుణ
స్తోముఁడు, మిత్రాన్వయాబ్ధి సోముఁడు, మేఘ
శ్యాముఁడు, శ్రీరాముఁడు, మ
మ్మోముత 'వ్యయ' నెల్లసుఖము లొనగూర్చుదయన్.

౨

క్రన్నుఁబ్రారబ్ధ కర్మభ రమ్ము నెల్ల
వ్యయమొనర్చి, యాగామి యేమియును లేక
యుండ, నిష్కామ్యకర్మాభి యుక్తి మనల
భవముఁ దరియింపఁజేయుత 'వ్యయ' సుఖముగ.

3

బలుబ్రమోషైతి నిపుడనుచు
విలపింపగవలదు ధర్మ వృక్షమ! భగవ
త్సలలిత కృపా వసంతము
చెలఁగఁగఁ దొల్లింటియట్లు చిగిరింతువులే!

శ్రీ

# ఉగాది ఉత్సవము

—:o:—

## సర్వజిత్ సంవత్సరాది

## 23—3—1947

★

అధ్యక్షులు :

బ్రహ్మశ్రీ బిదురు వెంకటశేషయ్యగారు

★

కార్యకర్తలు :

**శ్రీరామా బుక్ డిపో,**

విద్యా విషయక ప్రచారకులు,

మార్కెట్ స్ట్రీట్ — సికింద్రాబాదు.

# ★ ఉగాది ★

సర్వజిత్సంవత్సరాది సందర్భమున ఉదయము సికిందా్రబాదులోని శ్రీరామా బుక్‌డిపో వారిచే మార్కెట్ వీధిలోని వారి దుకాణమందు శ్రీ లక్ష్మీ సరస్వతీ పూజ గావింపబడి ఆగత మహాజన సత్కారము సలుపబడినది. నాటి సాయంకాలమున శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయ మందు సభ ఏర్పాటు చేయబడినది. 'దివ్యవాణీ' పత్రి కాధిపతులగు బ్రహ్మశ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారిచే ప్రార్ధన జరుపబడి, దైవజ్ఞశిరోమణి బ్రహ్మశ్రీ చివుకుల వేంకటరమణ శాస్త్రిగారిచే పంచాంగశ్రవణము గావింప బడినది. సభాధ్యక్షులగు బ్రహ్మశ్రీ బిదురు వెంకటశేషయ్య బి. ఏ. గారి ప్రారంభోపన్యాసానంతరము స్థానిక కవిప్ర ముఖులచే సంస్కృతాంధ్ర భాషలలో "ఉగాది సందే శము" ను గురించి కవితా గానమును, దైవజ్ఞ శిరోమణి బ్ర॥శ్రీ చివుకుల వేంకటరమణ శాస్త్రిగారిచే "పంచాంగ తత్వము" ను గురించి గంభీరోపన్యాసమును జరుపబడి సభికులకు శ్రోత్రపర్వమైనది. శ్రీరామా బుక్‌డిపో యజ మానులగు శ్రీయుత పబ్బా శంకరయ్యశ్రేష్ఠిగారు యథా శక్తిగా కవి పండిత సన్మానమొనర్చిరి. రెండేండ్లనుండి యును ఉగాది సందర్భమున నిట్టి విద్వత్సభల నేర్పాటు చేసి పురజన ప్రశంసలకు పాత్రులగుచున్న శ్రీయుత

పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారును, ఏతత్కార్య నిర్వహణ మున వారి కన్నివిధముల చేదోడు వాదోడుగా నుండిన శ్రీరామా బుక్‌డిపో మేనేజరగు శ్రీయుత నీలా రాజయ్య శ్రేష్ఠిగారును ఎంతయుధన్యులు. పురమందలి ఇతరధనాఢ్యులు వీరిమార్గము ననుసరించి విద్యావ్యాప్తికి సహాయ పడుదురుగాక యని కోరుచున్నాను.

ఇట్లు,
పౌరజన శుభాకాంక్షి
**మండల వెంకయ్య**

## ఏ. నిత్యానందగారు

సికింద్రాబాదు

★

౧

సీ॥ తులిదూగ భారతి తొలుపొత్త దాస్యపు
పండుటాకులురాల్చె పండుగలకు
స్వేచ్ఛయ న్పచ్చ లేజిగురుటాకులు వీడె
నిచ్చలుదీర కోయిలలు మెక్క
విజయ ప్రసూనము ల్వికసింప వేచిన
దేటులు దీయని దేనె గ్రోల
పసిడిఫలంబుల పంటకై వస్తుండి
చిరకాల మాసించు చిల్కలు దిస

గీ॥ మొగడలం గట్టివేయంగ మోసకాంధ్ర
సర్వము గడింపగలిగిన 'సర్వజిత్తు'
సందడింపగ స్వారాజ్య సంపదలను
సంతసముగూర్చు మనకీ వసంతఋతువు.

౨

సీ॥ మరులొంది స్వాతంత్ర్య మదనుండు భారతి
పరిణయమాడ సంబరముపడగ
స్వేచ్ఛాకిసాలముల్ చెలి సరోజినిమెక్క
కోయిలై 'కూ' యని కూయుచౌడగ
జవహారి సోదరి సకల సీమల పెండ్లి
పిలువులు పిలువంగ చిలుకపలెను
భారతీ వధువుకే పారాణి పూయంగ
చరణాలు చేబట్టె "నరుణ" తగదు

గీ॥ విజయ సుమరసంబులుగ్రోలి భృంగచయము
మధుర గీతికల్ పాడంగ మంగళముగ
పూలుపూయంగ పాలుపొందు పుష్పలతలె
యక్షతలు జల్లె మధువుపై నాసతోడ
పెండ్లి పందిళ్ళువేసిన పెండ్లిపెద్ద
యిల వసంతుడు సామ్రాజ్య మేలుగాత.

౩

సీ॥ కూటనుం గుత్తలు కొంపలుం గోడలు
కొల్చిచ్చు గొడవలు గూలుగాత
కల్లలాడుచు జనుల్ సల్ల బజారులో
బేరమాడుట లిట్టె విడుగాత
కసిపొంగ నొకరికొక్కరు కత్తిదూయుచు
కుత్తుకల్ కోయుట గోలుగాత
పైకెక్క పదపడి పదవికై పోరెడు
పొగరెల్ల బూడిదై పోవుగాత
గీ॥ నాస్తికత్వపు వాదనల్ నాస్తిచేయు
ఆస్తికత్వపు పాఠము లలరుగాత
సర్వసౌఖ్యము లొనగూర్ప 'సర్వజిత్తు'
పారతంత్ర్యంబు దొలంగ పరగుగాత.

# యస్. సి. శ్రీనివాస వేంకటాచార్యులుగారు

సికింద్రాబాదు

★

౧

అన్ని ఋతువులు గ్రీష్మమేయైన పలు ద
శాబ్దు లరిగినపిదప భాగ్యమునఁ జేసి
సర్వజి ద్వసంతము నేఁడు సమయ శోభ
సమధిక విశేష పరిశోభితముగఁ దోఁచె.

౨

మన ప్రభుత్వపు శాఖలను స్వతంత్రత ఘుమఘు
ఘుమల మాఱుపుపూలుకొమరు గులికె,
పెర యేలబడి సిగ్గుపెర పైఁటజార్చుచు
స్వాతంత్ర్య మారుత పోతమొలసె,
ఆనందమున జవాహరులాలు కోయిల
అభినవోదయ గీతి యాలపించె,
ప్రాణేశు దీర్ఘ ప్రయాణమ్ము విని పతి
వ్రత లీగు మతిసెడి బ్రతుకురోసె,
గాంధి దైవజ్ఞమణి ముక్త కంఠముసను
శాంతి పంచాంగ శ్రవణమ్ము సలుపుచుండె,
సర్వజి ద్వసంతోదార సమయమందు
గాలి పులకించె, పులకించె కణకణమ్ము!

## శ్రీ పరిపల్లి విశ్వనాథశాస్త్రిగారు, ఎం. ఎ.,
## సికింద్రాబాదు

౧

శంకరు శాంకరమ్మయిన శారద చంద్రకలా విలాసముల్
పంకజ గంధమాధురులు భవ్యమనోహర వామసుందరుల్
సంకుమదంపుతావులు రసాలసమాశ్రిత కోకిలధ్వనుల్
పంకరలేనిసూత్రముల భంగురవృత్తము నాహరించు నా
తంకములెల్లఁద్రోచి శుభతత్వముదిద్దగ నుత్సహించు ని
శ్శంక నెడందవీణియకు శర్వరిచుక్కల పూలపాలలో
వంకమలంగునాదముల వంధ్యకృతమ్ముల నిల్పనేర్పు మే
లింకని జీవనాడికల కేకతఁగూర్చు పరార్థపుష్టికే
సంకితమిత్తు శర్మదమహంకృతి దేవి కటాక్షమాలికల్ !

" ఆనందకృతి "

౨

మన ససలంటకుండ జడమాంద్యముకన్నులుకట్టకుండ క
మ్మని రసమాధురీరుచులు మత్సరశయ్యలఁ్రవాలకుండ తీ
యని భవభావమంజులుల హార్యపథమ్మున మీరియుండ దా
చనవగు పిల్పు శంకరముసాకున కాదనవింటి వచ్చితిన్.

" ఆనంద "

3

శ్రీయు శారదాంబయు వసు శ్రీల నెసగి
చిత్రవర్ణపు పుట్టమ్ము క్షితికినిడిరి
సరససంగీత సాహిత్య సరణులొలయ
పుట్టు రత్నాలగని యెంతొ పులకరించె.

౪

దిక్సతినుదుట కుంకుమ దీప్తియడరె!
కేరుకమలినిచెక్కులు కెంపువారె
కాన చివురించె జేవురు కాంతులలమె
రాగరంజితము ఉగాది రాకగాంచి.

౫

కన్నుకుట్టె నెడదనిండె, విన్న శ్రుతులు
మధువు నింపుకో జాలిన మార్గమరయ
దగు, విశాలమింద్రియ రాజ రగులుకొలిపి
రుచి పరాంకితమైన ప్రాగ్ రుచులనిలచి.

౬

రాగమంజరు లలమి పరాక్రమించె
మించగావలె వంకల సంచులందు
క్రిందు గంభీరశయ్యార విందమందు
వినుచు కింజల్కరాజి పన్నిటఁదడియ.

౮

వేగిందివెసతేచి విరివిగా విరిచెలుల్
పుష్పాడి పలురంగు మ్రుగ్గులిడిరి
మరుదర్భకులఁగూడి సరుదనుభంగ వి
హంగమ రాజి విహారవిహిరి
సుమనోజ్ఞ వాగ్విలాస మనుసరించంగ
పుల్లహృత్కంజముల్ వెల్లివిరిసె
కోయిల. యిలకోరి కొసరి కోయనిపిల్చి
మేల్కాంచి దివ్య మేల్కాంచుడనుచు
నంకురార్పణసమయ మటంచు నుషతేచి
పేరటాండ్రనుబిల్చి పేరుకొనుచు
నుదయకుంకుమరాగ ముజ్జ్వల ప్రభలతో
రంజితము ఉగాది రక్తిగరగి

చేతనా చేతనమ్ములు చెమ్మగిల్లె
పలుకుపలుకున కర్పూర మొలుకుచుండె
నని వసంతములాడె చల్వాలనుగట్టె
పిల్పువచ్చె ఉగాది కవ్వించె మనసు.

# ముందిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు

## సికింద్రాబాదు

౧

క॥ సర్వజగత్కారుండును
సర్వజగన్నాయకుడును సర్వగతుడునై
సర్వము తానగువాఁడీ
సర్వజిదబ్దాకృతిన్ బ్రజలసాకునొగిన్.

౨

ఉ. సత్సముదాయమెల్ల నిను
శ్లాఘనొనర్చి ముదంబు జెందగా
గుత్సితబుద్ధులెల్లఁ దమ
కూడని జాడల వీడిపోవఁగా
మత్సరతన్ దిగన్విడి క్ష
మాపతులర్మిలిఁగూర్ప సర్వజి
ద్వత్సరమా! శుభంబిడుమ
వారిగ భారతభూమి కిమ్ముగన్.

3

ఉ॥ కూటికిఁగుడ్డకున్ మిగులఁ
గుందుచు నుండిరి పెక్కురింక మో
మాటముఁబాసి చుట్టముల
మార్మొగమొందుచుఁ బంపుచుండి రె
చ్చోటను గేస్తు; లెవ్విధపు
శోభనకృత్యములన్నుఁ జిక్కె యీ
లాటి బెడందలన్ గృపఁ దొ
లంగఁగఁ చేయుమ! నూతనాబ్దమా!

౪

చ॥ సమరముదొల్గఁ గల్గునిక
　　　　శాంతియటంచని యూరడిల్లఁగా
సమరమునందు కన్న జన
　　　　సంఘము చాలసురుంగుచుండె ద
గ్ధములగుచుండె గ్రామములు
　　　　ద్రవ్యము వమ్మగుచుండె నక్కటా!
కుములుచునుండె డెందములు
　　　　గొప్పగ ఖిఁగొని నూతనాబ్దమా!

౫

గీ॥ ఎందువిన నార్తనాదంబు లెందుఁ గనిన
హింసలును బ్రతిహింసలు హెచ్చుమీరె
దారుణంబయ్యెఁ గాలంబు దయనుదలఁచి
శాంతిఁ గావింపు పరమేశ! శరణమగుచు.

౬

గీ॥ పాలకుండగు సకల లోకబాంధవుండు
అమృతకరుని సాచివ్యత హరువుమీఱ
పంటనెల్లను జీవాధిపత్యతఁ దగు
భవికముల కేమికొదువ సంవత్సరంబ!

# శ్రీ ప్యారక శ్రీరామానుజాచార్యులుగారు

సికింద్రాబాదు

౧

శ్లో॥ సానన్దం యన్మహిమ్నా ప్రతిదిన మభిత
త్సర్వలోకా విరేజుః
యో వేదాత్మా మహాత్మా సకల సుకృతినాం
సాక్షిరూపో బభూవ
తస్మా త్సూర్యాది రాజా ద్గుణగణమల
భద్వత్సరోఽయం విశుద్ధః
స్యా దేవం భూరిధామా కుమతివిదళనే
సర్వజిత్సార్వభౌమః॥

౨

యది కర్మభూమి మవనే సమీహతే
విజయోఽస్తి చాస్మ దనుకూల వర్తనాత్
పరివర్తమాన పదపాలనేయతే
దితి విశ్వరూప నయనే విచేలతుః॥

3

స్వాచతం సర్వజిద్వాజ స్తర్కగ్లాని కరాన్నరాః
విమృశ్య హితమార్గేచ ప్రవర్తయ మహాప్రభో॥

౪

తిక్తం భుక్త్వైవ పశ్చాద్రసచయ
మనుభోక్తవ్య మిత్యాహశాస్త్రమ్
యుష్మజ్జన్మోత్సవేహి ప్రథితమిద
మహో సాత్వికానాంసుశీలమ్॥
యత్సౌఖ్యం వత్సరాదా వనుభవతి
జనస్తత్సమభ్యేతి పశ్చా
దేతల్లోకోక్తి విజ్ఞో మనసి దృఢతరం
భావయేద్దేవ సంపత్॥

౫

విద్వద్బృన్దపయోధి రత్ననిచయస్సం గృహ్యతేఽనేకశః
వాణీపోషణ తత్పరశ్చసతతం జ్ఞానామల స్రోతసాం॥
స్నానాద్యైత సలాఞ్ఛనస్త దధునా సత్యజ్యతేఽదోమునా
పబ్బాపూర్వక శంకరోహి విదిత స్సంవత్సరాదావితి॥

౬

హృదయం విహాయరమతే రమాపతిః
పృథు పుస్తకా పణగృహేఽప్యతోఽధికమ్॥
ఇతినీలిమా శశధరౌజవాద్యజౌ
భువి నీలరాజనవృషా సమాయయౌ॥

౭

గంగాప్యమృత నిష్యన్దివచోవశ్యా విధారణాత్
అబ్దాది పరిషద్రూపం శంకరస్యాస్త్యద్భగీరథః॥

౮

శ్రీరామాజ్ఞాకృత బుద్ధిపో విజయతాం శ్రీశైలనాథేక్షితిః
సంఖ్యావత్త్రియ నీలరాజ సదృశం సన్మిత్ర బృన్దందదః॥
దేవబ్రాహ్మణపూజనేఽర్పితధియం ధర్మక్రియాతత్పరమ్
పఞ్చాశంకర సద్విశం కుచసుత జ్ఞానాన్వితం ధూర్జటేః॥

౯

సంపూర్ణార్ధ సురేశ చిత్తహరణ స్వస్థన్మహాభ్రూభ్రమ
ద్భృఙ్గాధ్యానిత కల్పభూరుహసభా భూదేవ విద్వద్వచో॥
మాధుర్యామృత సర్వచిత్త విబుధప్రీతి ప్రకర్షక్రియా
సంధానాతుర శంకరో విజయతాం పీయూష విక్షేపణాత్॥

# బిదురు వెంకటశేషయ్యగారు, బి. ఏ.,
## హైదరాబాదు

౧

సీ॥ ఆర్థికాభ్యుదయమ్ము నలవర్చుకొను ప్రజల్
తలిరుఁ బూవుల బండ్ల ధరణిజములు;
గ్రంథాలయాది సారస్వత సంస్థలు
కొమరుగుల్కెడి లతాకుంజకములు;
సత్యసౌందర్య దర్శనములం దనియించు
సుకవులు శారికా శుకపికములు;
సాధుపండితుల భాషా మాధురీఝురుల్
తేఁటలైపాఱు పూఁదేనెవాఁక;

గీ॥ లనఁగ, మన తెల్గునాడెల్ల ననవరతము
రమ్యమైన సారస్వతారామసీమ
గా నిలిపి, యోషధీశుఁడై చాని సొంపు
పెంపుఁగావించు సర్వజిత్ప్రియ విభుండు!

## శ్రీ అమరవాది వేంకటశాస్త్రిగారు

సికింద్రాబాదు

కం॥ ఉర్వీజనముల మంగళ
సర్వారంభములు దిగ్విజయమై ప్రియమై
పర్వ, సహస్రాంశువు లీ
సర్వజిదాభిఖ్య కాలచక్రము నేలున్.

౨

సీ॥ లోకబాందవ కృపాలోకి తావనిలోన
లోకబాంధవవృత్తి లోపమగునె?
కర్మసాక్షి యొనర్చు ధర్మపాలనమున
కర్మసాక్ష్యంబుల కరవుగలదె?
మిత్రవితోర్వి సత్క్షాత్రమై పాలుపొంద
మిత్రవనంబిక మృగ్యమగునె?
గ్రహరాజ రక్షనిమ్మహితాల్ప నల్పమౌ
గ్రహచారములకు వక్రంబుగలదె?

తే॥ గీ॥ సర్వజన పితృకారకస్వామి, భూమి
దేవ దైనందినక్రియా ధీనమూర్తి
''సర్వజిద్వర్ష'' మేలుచో సర్వసౌఖ్య
సంప దభివృద్ధిఁగాంచరే? సర్వజనుల్.

౩

తే॥ గీ॥ సర్వజిన్మాఘ చేపట్టి సమయకర్త
సక్రమంబుగదీర్చు కార్యక్రమంబు
లోన ముఖ్యాంశమేదొకో గాని, యూహ
సేయ విజయునిఁగాంచుచు చెప్పనొప్పు.

౪

చ॥ కవుల నొకప్పుడైనను జ
గద్విదితంబుగ సత్కరింపఁగాఁ
దవిలిన మానసంబుగల
ధన్యుఁడగున్గద శంకరాఖ్యుఁడా
ప్రవిమల బుద్ధిమంతునకు
బండితులేమి యొసంగనేర్తు, రా
యువు సిరి, సంపదల్గలిగి
యుండఁగఁ గోరుదు రెల్లకాలమున్.

౫

క॥ "శ్రీరామా బుక్కుడిపో"
పేరెంతయు దినదినాభివృద్ధి వహింపన్
శ్రీరాముఁ డోము గావుత
నూరేండ్లు తదీశ్వరుల ననూనప్రేమన్.

దివ్యవాణి పత్రికా సంపాదకులు :

**చివుకుల అప్పయ్యశాస్త్రిగారు**

సికింద్రాబాదు

౧

తరణి ప్రభుండు మంత్రి శశి,
ధాన్యవిభుండు కుజుండు నీరసే
శ్వరుడు బుధుండు జీవుడును
సస్యపుఁడభ్రదళార్ఘనేత భా
స్కరుఁడు రసాధిపుండు కవి,
గ్రాలగ సర్వజిదాఖ్యనొప్పు నీ
శరదయు దివ్యవాణియు యశ
మ్మును శమ్మనిశమ్ము నిచ్చుతన్.

---

శ్రీ

# ఉగాది ఉత్సవము

—— :o: ——

## విరోధి సంవత్సరాది

## 30—3—1949

★

అధ్యక్షులు:

బ్రహ్మశ్రీ ఆచార్య

**కురుగంటి సీతారామయ్యగారు, ఎం. ఏ.,**

★

కార్యకర్తలు:

**శ్రీ రామా బుక్ డిపో,**

విద్యావిషయిక ప్రచారకులు,

మార్కెట్ స్ట్రీట్ — సికింద్రాబాదు.

# ఉగాది

సికింద్రాబాదు మార్కెట్ వీధిలోని శ్రీరామా బుక్ డిపో వారి యాజమాన్యమున శ్రీ విరోధి సంవత్సరాది మహోత్సవము కడువైభవముగా జరుపబడినది. ఉగాది నాటి ఉదయము గం॥ 9-30 లకు శ్రీరామా బుక్ డిపో వద్ద శ్రీ లక్ష్మి సరస్వతీపూజ జరుపబడి, వచ్చిన మహా జనులకు చందన తాంబూలాది సత్కారము జరుపబడెను. ఆనాటి సాయంకాలము గం॥ 5 30 లకు కింగ్సువేలోని రావుసాహేబు బూరుగు మహదేవశ్రేష్ఠిగారి ధర్మభవనమున వేదమంత్ర పఠనముతో కార్యక్రమము ప్రారంభింపబడెను. బ్రహ్మశ్రీ ఆచార్య కురుగంటి సీతారామ భట్టాచార్యులవారు, ఎం ఏ, అధ్యక్షత వహించిరి. అధ్యక్షులు తమ అమోఘమైన ప్రారంభోపన్యాసమున మన ప్రాచీన నాగరికతను గూర్చియు, వివిధవిద్యా నిపుణతనుగూర్చియు, ముఖ్యముగా మన ప్రాచీనులు వివరించిన జ్యోతిర్విద్యా విశేషములనుగూర్చియు, ఇప్పుడు మనము మన వేదమంత్రములలో అణగియున్న విజ్ఞానమును వెలికితీసి ప్రచారము చేయవలసిన అవసరమును

గూర్చియు, కవిత్వమునకును జ్యోతిషమునకును గల సంబంధముగూర్చియు మిక్కిలిచక్కగా నుపన్యసించిరి. బ్రహ్మశ్రీ వేలూర్తి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రులవారిచే విరోధి సంవత్సర పంచాంగశ్రవణము గావింపబడెను. ఈ క్రింది కవిపుంగవులచే "ఉగాది సందేశము" నుగూర్చి కవితాగానము సలుపబడినది:— (1) శిరోమణి కె. నరసింహశాస్త్రిగారు, (2) విద్వాన్ పెరవలి లింగేశ్వరశాస్త్రిగారు, (3) విద్వాన్ మేడిపల్లి లక్ష్మీకాంతముగారు, (4) శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, (5) శ్రీ చిగురుపాటి సుబ్రహ్మణ్యజోషిగారు, (6) శ్రీ బుఱ్ఱా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. బ్రహ్మశ్రీ అనుముల రామనాథశాస్త్రి, శ్రీ సోమశేఖరశాస్త్రిగార్లచే 'ఉగాది' మహత్త్వమును, మన కర్తవ్యమునుగురించి ఉపన్యాసము లీయబడినవి. బ్రహ్మశ్రీ భీమవరపు సాంబశివశర్మగారిచే "రాద్ధాంత పంచాంగశ్రవణము" జరుపబడి, అందు ఆధునిక పరిస్థితులు జ్యోతిశ్శాస్త్రానుకూలముగా, హాస్యరసయుక్తముగా విమర్శింపబడినవి.

అధ్యక్షులు శ్రీ భట్టాచార్యులవారు అత్యవసర కార్యాంతర వ్యాసంగమువలన కార్యక్రమ మధ్యమున హైదరాబాదుకు వెడలిపోవలసి వచ్చుటచే, వారిస్థానము శతావధానులు శ్రీమాన్ శ్రీనివాస వేంకటాచార్యులవారిచే సలంకరింపబడినది. శ్రీ ఆచార్యులవారు తమ ఉపసంహారోపన్యాసమున ఆర్షవిద్యల గొప్పదనమును గూర్చియు, మన ప్రస్తుతస్థితిని గూర్చియు, మన విద్యలను, నాగరి

కతను అభివృద్ధిచేయుటలో మన కర్తవ్యమును గురించియు, ఆంధ్రరాష్ట్రావశ్యకతను గూర్చియు హృద్యముగాను, భావపూరితముగాను ఉపన్యసించి, రాబోవు సంవత్సరమునుండి యీ ఉగాది కార్యక్రమమును వసంత నవరాత్ర కార్యక్రమముగా మార్చవలసినదనిసూచించిరి. సభాంతమున సభ్యులకును, అధ్యక్షులకును, శ్రీరామా బుక్‌డిపోవారి పక్షమున భీమవరపు సాంబశివశర్మగారు వందనసమర్పణము చేసిరి. సభా కార్యక్రమమున పాల్గొన్న కవిపండితులకును, అధ్యక్షులవారికిని, శ్రీరామా బుక్‌డిపోవారు యథాశక్తిగా దుకూలాదులచే సన్మానము జరిపిరి. శ్రీరామా బుక్‌డిపో యజమానులగు మ॥రా॥శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారును, మేనేజరగు మ॥రా॥శ్రీ నీలా రాజయ్యగుప్తగారును, కవి పండితుల యొక్కయు, అధ్యక్షులయొక్కయు ప్రశంసలకును, ఆశీస్సులకును పాత్రులయిరి. సభ జయప్రదముగా సంపూర్ణమయ్యెను.

---

# సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు
## సికింద్రాబాదు

౧

కం॥ శ్రీశుఁడు రక్షించుతఁ బ
బ్బాశంకర గుప్తకిడి శుభ పరంపరలన్
రాశీ భూతశ్రీలు ద
యా శౌచాదులును నాయు రారోగ్యంబుల్.

౨

ఆ॥ వె॥ చాంద్రమానమునఁ బ్రజల కియ్యది విరోధి;
గాని వర్తకులు దగఁ గ్రహింతు
శుభకృదబ్దముగనె క్షోణిబార్హస్పత్య
మాన మనుసరించు మదివహించి.

౩

ఆ॥ వె॥ శాత్రవులకునేని స్వాగతంబిచ్చుట
ఆర్ష సంప్రదాయ మగునుగాన
నో విరోధి! నీకు నొసగుచున్నారము
స్వాగతము! గ్రహింపరాఁగదయ్య!

౪

చ॥ ధారుణి సర్వసస్యభరితంబుగ,
సత్ఫల పుష్పసంతతిన్
భూరుహముల్ దగన్ బశుస
మూహము పాల్పితుకంగ, నీతి బా
ధారహితంబుగాఁ సిరులు తామర
తంపరగాఁ బ్రజాళి యొ
ప్పార విరోధివత్సరము భద్రము
లిచ్చుత నిర్విరోధియై.

## బుఱ్ఱా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
సికింద్రాబాదు

౧

సర్వధారి చనఁగ చక్కఁ పచ్చె విరోధి
వత్సరం బిదియె మహోత్సవముగ
మత్సరంబులుగాని కుచ్చితంబులుగాని
హృత్సరోజములు వహించు టెట్లు.

౨

లోపలనున్న కల్మషము లోపలనుంచక పైకిఁ జిమ్ముచో
ఓపిక లెంతలున్న మదినూల్కొనుగాదె విరోధభావమా
కాపురుష ప్రవృత్తులు జగంబున మిక్కిలిగానవచ్చు తత్
ద్రూపము తెన్నియున్న నవరోధము సేయుట యొప్పుగాదొకో.

౩

శ్రీరామా బుక్కుడిపా
సారస్వత సేవకలిమి సమకూరునిలన్
భూరి ధనాదాయము
లింపారి విరోధివత్స రాంతరమందున్.

౪

పబ్బావంశ సుధాపయో జలధికిన్
బ్రాలేయ భానుండు తా
మబ్బున్ జీల్చి వినూత్న సత్కళల సం
పద్వైఖరిన్ వెల్గుచున్

తబ్బిబ్బుల్ గనకుండునట్లుగ శతా
నందుండు గాపాడుతఙ
పఙ్బాశంకర నామధేయుని కృపా
పారీణ చిత్తంబుతో.

గీ

శంకరునామసామ్యమున శంకరుడెట్టికి బ్రోవకుండు నీ
శంకరునింకమీద మృదుసాధు వచోమృతధారలీను ఈ
శంకరపాలితాఖిల విశాల సువాఙ్మయసృష్టియెల్ల ని
శ్శంక తదీయవృద్ధికగు సాధనసంపద నిచ్చుగావుతఙ.

# కేశవపంతుల నరసింహశాస్త్రిగారు

## హైదరాబాదు

౧

గీ॥ అంచెలంచెలు పుడమి వహించుజాతి
వాయువమ్ములు ప్రభవాది వత్సరములు
ఈ విరోధియుఁ దా గమియించుఁగాత
కుదుపులేకుండ విశ్వసంపదవహించి.

౨

గీ॥ ప్రబల హింసావిరోధియై పరధనాప
హరణ సువిరోధియై, శాంతి నహరహంబు
రూపుమాపెడివారి విరోధియగుచు
వరలెడు విరోధి సౌఖ్య సంపదలఁ బొదలి.

౩

చ॥ మృదుల రసాలపల్లవ స
మిద్ధములై తగు ద్వారసీమలన్
బొదలు గృహంబులన్ సతియు
బుత్రులు మంగళవేషధారులై
కదియ సచూతనింబసుమ క
మ్రరసంబును గ్రోలు మాకిలన్
సదమలచిత్తవృత్తియును,
శాంతము, సౌఖ్యము గల్గుగావుతన్.

౪

సీ॥ పూలదోయిలి జగన్మోహనంబగు మీదు
వాచావిలాస సౌభాగ్యమునకు
హృదయార్పణము రసాస్పదమగు మీకావ్య
బంధ బంధుర లసద్భావములకు
కైమోడ్పు నిఖిలలోక ప్రశస్తము మీదు
శేముషీవిభవ విశేషమునకు
నీరాజనము భవన్నిస్తుల జయరమా
సమధికంబగు శౌర్యసారమునకు

గీ॥ విమల విజ్ఞానవిభవ పవిత్రహృదయ
పంకజాతంబులివె మీ కుపాయనములు
మహిత సంవత్సరాది సన్మహమునందు
నలఘు గుణులార! ఓ సోదరాంధ్రులార!

౫

గీ॥ పూజ్యపౌ వైశ్యకులయశంబును జగాన
వెలయఁజేసితి సత్కవీశ్వరులఁబిలిచి
సత్కృతుల్ జేసి సద్భక్తి శంకరయ్య
అలరె పబ్బాన్వయంబు నిస్తులతజగతి.

౬

శా॥ శ్రీలావణ్యవతి శతహ్రదయురస్సీమన్ కళల్ నింప స
చ్చేలా కైతవసాంధ్యలక్ష్మి పదముల్ సేవింప, శంఖస్వనో
త్తాలంబౌ స్తనితంబు భక్తశిఖులన్ దన్పంగ, నీలాంబర
వ్యాలోలంబగు కేశవాబ్దము కృపావార్ధార నిన్నోముతన్.

---

## పెరవలి లింగేశ్వరశాస్త్రిగారు

హైదరాబాదు

౧

స్వాగతమయ్యె మీకు నవభారత పౌరవతంసులార! సు
స్వాగత మార్యసంస్కృతి విశాలచతుష్పథ వర్తనాగతా
నాగతవేదు లాంధ్రవిపు లావనిఁబుట్టిన యట్టివారికిన్
వేగము ధన్యవాదములివే కొనుఁడయ్య ఉగాదికానుకల్.

౨

నవపలాశముల వనాలఁజల్లుల నాడె
మధుమాస లక్ష్మితో మాధవుండు
కొసరి పూఁదేనియల్ గూర్మి సేవించిన
గండు తుమ్మెదల ఝుంకారమొప్పె
విశ్వసౌభ్రాత్రంపు విశ్వాసగీతాల
నింపుగాఁగవి కంఠమెత్తి పాడె
నింబముల్ బుష్పించె నిండెఁబింపెలమావి
చెఱకుశర్కరలను సేకరించె

సర్వధారి సమస్తంబుఁ జక్కపఱచి
చనియెనిదిగో విరోధి వత్సరము వచ్చె
హితునకు విరోధికిని బ్రీతి హితముఁగూర్ప
నీయుగాదిని శపథంబు సేయుమయ్య!

3

ఆమ్లతిక్త మధు రసైక్యమౌ నమృతంబు
నాని భిన్నరుచుల నైక్యపరచుఁ
డీ విరోధిసామ్యుఁ డీశుండుగావున
మనుచు శాంతినొసఁగి మానవులను.

౪

చనియెన్ భారతజాతికష్టములు ప్రాశస్త్యంబుఁజేకూరె సం
ఘనిరాడంబరజీవి నెహ్రూ వరలక్ష్యానంద మార్గంబులోఁ
గనిపించెన్ సుఖశాంతి జీవనములా గాంధీమహాదర్శముల్
మనముంజేర్చిసుఖింపు, భారతమహింసామూర్తిఁ
జెన్నారగన్.

౫

భాస్కరుడారోగ్య భాగ్యంబు నొసగంగ
నరవిందభవుఁడు దీర్ఘాయువొసఁగ
వాణీవధూజాని బహువిద్యల నొసంగ
శివుఁడణిమాది సంసిద్ధినొసఁగ
అమరేంద్రుఁ డతులభోగాసక్తి నొసగంగ
పద్మాలయాపతి భాగ్యమొసఁగ
రామచంద్రుఁడు సోదరప్రేమ మొసఁగంగ
దిక్పాలకులు యశో దీప్తి నొసఁగ

పుడమినీయన్వవాయంబు మూడుపూవు
లాఱుకాయలు కాయఁగ నర్వతముఁడ
వగుచు శంకరగుప్త ధర్మానురక్తి
నిత్య కళ్యాణములతోడ నెగడుమయ్య.

## చిగురుపాటి సుబ్రహ్మణ్యజోషిగారు

సికింద్రాబాదు

౧

గడచెనుసర్వధారి అనుగామి విరోధిపదానభీతి నీ
యెడజయమేఘటించుననుచు కడిమిన్గొనుమాటతథ్యమై
పుడమి సమస్తజీవులకు బాచులరేడుయొసంగ భూతి మా
మిడిచిగురొత్తెకోయిల నవీనరుచుల్ తొలికించి పాడగన్.

౨

వాడినమోడుమ్రానుల యవాప్తి విధాన సికింద్రబాదు రా
పాడుచు దుండగీంద్రుః యెడబాప ప్రజల్ పరువెత్తిపోవ యీ
నాడుఘటిల్లె సంస్థితి సనాతనమీయెడ మోముజూప గా
పాడ విరోధినామము అపార ముదమ్ముచెలంగ మీయెడన్

3

కుక్కలుజించు విస్తరినగూడినపోల్కి వచింపదాడి యవా
పక్కనిజూపి ప్రాణులకపారశ్రమల్ ఘటియించిమించి రా
బొక్కసమందుద్రవ్యమును పొట్టలనించినవారు నాడుమా
ప్రక్కకురావిరోధి యెడబాపె యొకింతరవంత నేప్పుతోన్

౪

యిదియొకపద్ధతంచువచియింప సనాతనమార్గమౌట నీ
యెడతళుకొత్త పండితులనేకమునన్ కొనియాడపామరుల్
ముదమలరార నూతనప్రమోదమునన్ యిటుపబ్బశంకరుం
డుదయముజూపెసమ్మతినయోక్తి విధాన కవిత్వగానమున్.

౫

సీ॥ శ్రీరామ బుక్కడిపో శ్రీపతి సేవ్యుఁడు
వైశ్యకులాన్వయ వర్తితుండు
పబ్బువంశాన్విత పాలిత ధుర్యుండు
శంకరనామాఖ్య శంసనుండు
కవిపండితార్చన గౌరవధుర్యుండు
సతిసనాతనపక్ష నాయకుండు
నీలరాజయు సేవ్య నిరతానుగుణ్యుండు
పరహిత సంస్కార పాలితుండు

గీ॥ సతత సౌభాగ్యసంపదల్ సరసమాడ
శ్రీనికేతనమౌట యాశీస్సులలర
మాదు కవితావిలాసము మాయొసంగ
కూడి కోర్కెలదనియుత కోటివిధుల.

౬

సంతతిలో ప్రసక్తిగనజాలి ఖిలమ్ముఘటిల్లవాని నీ
చింతనకైత కన్యనుభజింప యుపేక్షజనించెగాన యు
ద్యంతరమేమి అందులకు నాస్తి జలంగుము శంకరార్యయా
త్యంతికమై యశంబున విహారము సేయక పద్యమాలికల్.

౭

సాహిత్య పోషితాచయు
శ్రీహితుడవు శంకరాఖ్య చిత్తస్ఫూర్తిన్
యిహపరదాయకమగు నీ
సహకారము కైతకన్య సత్కృతిదాల్చెన్.

## వేడిపల్లి లక్ష్మీకాంతంగారు

**హైదరాబాదు**

౧

వచ్చెపో మనపాలి సంవత్సరాది
తెచ్చెపో ఆంధ్రరాష్ట్రంబు, తెలుగువారి
కిచ్చెపో వాంఛితార్థంబు, కీర్తికాంత
మెచ్చెపో మనపట్టాభి మెడను సరము.

౨

ఎన్నియోవత్సరంబులు కన్నుమూసి
తెఱచునంతలో గ్రక్కున తిరిగిపోయె
ప్రజలుకూలిరి, దేశంబు వ్రయ్యలయ్యె
ఇంక దేసెడిదేమిటి యీవిరోధి

3

ఆంధ్రరాష్ట్రంబు విషమయ్యె, ఆంధ్రులన్న
కండ్లు భగ్గునమండును, కడకుతేనె
సోనలొల్కెడు మాతెల్గు సొట్టవోయె,
కొత్తరాహుల కార్పణ్యమౌర! చెప్పుమ.

౪

శ్రీలలనామనోహరుఁడు శ్రీకరమూర్తి దయాసముద్రుఁడున్
లీలను భక్తసంతతుల లేమినిబాపు వదాన్యమూర్తి గో
పాలుడురాధికాహృదయ పంకజలోలుడుశ్యామసుందరుం
డేలుత శంకరయ్యను మహేంద్రునిగా, రతనాలమూటగా.

౫

ఆయురారోగ్య భోగభాగ్యంబులను నొ
సంగి రక్షించుగావుత శంకరుండు,
అతిశయిల్లు శ్రీరామ గ్రంథాలయంబు
లక్ష్మీకాంతుని కృపను సల్లలితముగను.

శ్రీ

# ఉగాది ఉత్సవము

—— .0. ——

## వికృతి సంవత్సరాది

## 19—3—1950

★

అధ్యక్షులు :

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, ఎం. ఏ.,

★

కార్యకర్తలు :

## శ్రీ రామా బుక్ డిపో,

విద్యావిషయికప్రచారకులు,

మార్కెట్ స్ట్రీట్ — సికింద్రాబాదు.

# ఉగాది

19—3—50 తేదీనాడు ఉదయము సికింద్రాబాదు మార్కెట్టువీధిలోని శ్రీరామా బుక్‌డిపో ప్రొప్రయిటరు శ్రీ పబ్బా శంకరయ్యశ్రేష్ఠిగారు, శ్రీ నీలా రాజయ్య ప్రభృతి బంధుమిత్ర పరివార సహితముగా శ్రీ లక్ష్మి సరస్వతీపూజాదులంగావించి యాహూతులగు నతిథులను సత్కరించిరి. వీరానాటి సాయంకాలము కింగ్సువేలోని బూరుగు మహాదేవశ్రేష్ఠిగారి ధర్మభవనమున 5 గంటలకు వార్షికముగా జరుపు సంవత్సరాది సమ్మేళనము జరిగినది. ఈ సమ్మేళనమునకు ఉస్మానియా యూనివర్సిటీ ప్రొఫెసరులగు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం. ఏ. గారు అధ్యక్షులుగా నుండిరి. తొలుత వేదమంత్రములతో దైవప్రార్థన గావింపబడెను. శ్రీ వి సుబ్రహ్మణ్యముగారు భరతమాతృస్తవము జేసిరి. శ్రీ బి. రామారావుగారు స్వాగతము సమర్పించిరి. అధ్యక్షుల ప్రారంభోపన్యాసము గావించినపిదప శ్రీ వంకా విశ్వనాథశాస్త్రిగారు పంచాంగశ్రవణము జేసిరి తరువాత పండిత, కవుల కవితాగానమయ్యెను వీరి యుగాది సందేశ పద్యములు ఇందే ప్రచురింపబడినవి. ఈ కవి పండితులను యథోచిత సత్కారములతో సన్మానించిరి. శ్రీ వై రామదత్తశర్మ బృందమువారు విద్యారణ్య చరిత్రను సంగ్రహించి హరికథారూపముగా జెప్పిరి రాత్రి దాదాపు 9 గంటలకు కృతజ్ఞతా వందనములతో సభ సంపూర్ణము గావింపబడినది.

# పరిపల్లి విశ్వనాథశాస్త్రిగారు, ఎం. ఏ

## సికింద్రాబాదు

ఉ

తలపుల వాకంలన్ గృతుల
　　　　ధర్మవిధానము దప్పకుండ నీ
నిలచినవృత్తి వర్తనల
　　　　నిత్య శుభప్రదమూర్తిమద్ద్యుతుల్
వెలయగఁ జేయుమయ్య నిను
　　　　వెలుపులోముత శంకరయ్య చం
చలతకుఁ దావ్కలేక మహి
　　　　సర్వము ప్రాభవమై చెలంగుతన్.
మెలపున వృత్తిలో గృహస
　　　　మీకరణమ్ముఁన తోడివారిలో
నలరులతావులై చెయిద
　　　　మందు తమానము కీర్తి కాంత నిన్
పలచి పరించుగాత కవి
　　　　వర్యుల వాక్సుధ నీచరిత్రకే
యలవునసైన పూర్ణతమ
　　　　మాయువు సంతతిఁగూర్చి యిచ్చుతన్
కులగురులై యశస్విని య
　　　　కుంఠిత ధర్మముగూర్చు పత్నితోన్.

" ఆనందకృతి "

---

## ధ. శేషగిరిశర్మగారు

నరసారావుపేట

౧

విశ్వస్యోత్పత్తితః ప్రాక్కల భవన మవి
జ్ఞాపయన్ బ్రహ్మణోయః ।
సృష్ట్యన్తర్భూత భూతేష్వపి భవనమసౌ
ప్రాప్య ద్విస్సృష్టిమాప ।
"తత్సృష్ట్వా ప్రావిశత్స్వం ప్రకృతి" మితి పురా
వాచ మాచారతో ద్రాక్ ।
ప్రఖ్యాప్యేశస్య లీలాం కథయతి స తనో
తూదయం మఙ్గళానామ్॥

౨

మృదః కుంభ మంభోనిధేః ఫేనభంగా సువర్ణస్య
వా కుండలాది ర్వికారః ।
సతో వైకృతం విశ్వమిత్థం ప్రబోద్ధుం
వికృత్యాఖ్య సంవత్సరో హ్యావిరాసీత్॥

౩

చతుర్వింశతి తత్త్వానాం మేళనం విశ్వతాం గతమ్ ।
ఇతి వక్తుం శరదియం చతుర్వింశత మాఽభవత్॥

౪

అక్షి ప్రాప్యేవ కాలే, శ్రవణ సుఖసమా
స్వాదనం కర్ణహీన।
స్సన్తానం ప్రాప్య వన్ధ్యా, జలదనినదమా
కర్ణ్య వా యన్మయూరః।
సౌఖ్యం ప్రాప్నోతి; తద్వన్నవశరదుదయం
వీక్ష్య బాలాయువానో।
వృద్ధానార్యశ్చ తుష్టాః కిము విహిత మము
ష్మిన్దినే ప్రాగ్విధాతా॥

౫

అఙ్కావేశిత పఙ్కజాక్ష రనన్త జన్మ సమాపత।
త్వఙ్కాలేపవిధూననః పరతత్త్వబోధపరాయణః।
శఙ్కరః కవికిఙ్కరం సుయశో౽ఙ్కతం సుగుణాబ్ధిపబ్బా
శఙ్కరం సకుటుంబమన్వయ శఙ్కరం పరిరక్షతాత్॥

---

## జంధ్యాల వెంకటసుబ్బరామశాస్త్రిగారు

సికింద్రాబాదు

★

౧

ఉ॥ పండుగలందు ప్రప్రథమ
పర్వమటంచు యుగాదిపండుగన్
పండినవృక్షముల్ శిథిల
పత్రములన్ విడనాడి నూతనో
ద్దండ ప్రవాళసంచయము
దాల్చ ననురీతి విరోధివత్సరం
బొందుగ తింప గా వికృతి
బోరనవచ్చె జనానుకూలమై.

౨

గీ॥ విరచితానావకాశ సం వేద్యమైన
విశ్వమానవ సౌహార్ద్ర వీథయందు
మోదమందింప నిపుడు దా నుద్భవిల్లె
వికృతి హాయన సౌఖ్యంబు విస్తరిల్లె.

3

శా॥ ఏమున్నేగుచు దేశమందు వివిధా
భీలత్వమున్ గొల్పి దు
స్సాంగత్యంబుల నా విరోధి సుఖసం
జాతంబులన్ గూల్చె మా
శృంగారంబుల రక్షణంబు భవదీ
యంబౌటచే సత్సుధీ
భృంగానంద విధాయనీ వికృతి నా
పుష్పాంజ లర్పించెదన్.

౪

గీ॥ భ్రమర ఝుంకారనాదముల్ శ్రుతులుగాగ
వాయుపూరిత వేణు వాయిద్యమలర
నదుల తరంగలమోగ్త మృదంగములుగ
గండుకోయిల కూతలే గానములుగ.

౫

గీ॥ ననలవిరజిమ్మ శ్రీలతల్ నాట్యమాత
పవిమలాకాశ నీరద భాజనమున
అరుణ భాస్కరకాంతులే హారతిగను
అందుకొమ్మోయి స్వాగతం బబ్బరాజ!

౬

శా॥ ఏలా నిక్కృప మాపయిం బరపి మ
మ్మేలాగు రక్షించెదో
నీలీలన్ గన సాధ్యమా విక్రుతి మా
శ్రీరామ గ్రంథాలయం
బేలాగైనను గాచి మా యభిమతం
బీడేర నీ సత్కృపా
జాలంబున్ బురికొల్పి కావుము న
మస్కారంబు లర్పించెదన్.

జి. లక్ష్మీకాంతయ్య, ఎం. ఏ.
హైదరాబాదు

౧

చూత ప్రవాళైః, పిక శారికాణాం
రుతైర్మనోజ్ఞైః పరితో వనాని।
గృహాది సమ్మార్జన ధావనైశ్చ
సదంగవల్లీ విసరైస్సమంతాత్॥

౨

సుతోరణై ర్భూషిత గేహబృందైః
అభ్యంజనై రుష్ణజలాభిషేకైః।
మహార్హన వ్యాంశుకధారణైశ్చ
హూతైశ్చ జామాతృసుతాప్తవర్గైః॥

౩

నింబప్రసాదై ర్మధురేష్టభోజ్యైః
పంచాంగపాఠశ్రవణై స్యభాసు।
ఆశీర్భిరామంత్రిత పండితానాం
మృదాంగనాదత్త కృపాకటాక్షైః॥

౪

వికృతి నామక వత్సర ఆగత
శ్శుభదినే రవివాసర సంయుతే।
పరమ కారుణికస్య జగత్పతేః
కరుణయా భవతాం శుభదోస్తు నః॥

౫

నృపాః ప్రజారంజన లబ్ధవర్ణాః
కవీశ్వరాస్సత్కృతి నిర్మితౌరతాః ।
జనాస్స్వధర్మా చరణప్రసక్తా
రాజ్యావినీతేతి భయానిచస్యుః॥

---

## కోటమర్తి నాగేశ్వరశర్మ

హైదరాబాదు

౧

నిన్నటిదాక నగ్గడ ననిష్టపరంపర ముంచితేల్చె నా
చెన్నటి యావిరోధి ఘనసేతు హిమాచలమధ్యసీమ మా
కెన్నడు వీనిపీడవిడు, నెన్నడు శాంతిలభించునో యనన్
క్రన్ననవచ్చితే వికృతి! కాల్గదలించుక నేమిచేసెదో.

౨

నాయనా! నీదుపేరు విన్నంతమాత్ర
గుండెలదరెను ప్రాణంబు కుదుటబడదు
వికృతి! మాపాలబడితివే వేడుకొందు
పేరు సార్థకమొందింప బూనకయ్య

౩

ఎన్ని 'ఉగాదు' లో గడచె నిప్పటికీధర బుట్టుటాది నే
గన్నదిలేదు నవ్యత యొకండును నంతయు పాతపాటయే
ఉన్నదిచెప్పినాడ మదినుత్కృదొ? సత్యము నిష్ఠురంబుగా
తిన్నగసంచరించి వికృతీ! చరితార్థతగాంచు మొయ్యనన్.

౪

శుకపికశారికానికర సుస్వరభాస్వరమై మహీరుహ
ప్రకరము నేత్రపర్వముగ పల్లవితంబగుచుంట మల్లికా
వకుళజపాద్యనేక సుమ వల్లరులల్లన జూచుచుంట నీ
వికృతినె గల్గెనె? ప్రకృతివేత్తలెరుంగరె? నూతనంబొకో.

౫

నీకతానను నేడు మా లోకమందుఁ
గలిగిన విశేషమేమియు గానరాదు
కాని చేదస్తమొక్కటే కానిపించు
వచ్చెను 'ఉగాది' యనుచు సంబరముగనుట.

---

# సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు

సికింద్రాబాదు

౧

ఆ. వె. వికృతివత్సరంబ ! విచ్చేయునీకు సు
స్వాగతంబుగాక నట్టిస్వాగ
తంబు నిత్తువెఱచి త్వత్స్వభావముఁగాంచి
భయముతోడ నట్టి భక్తితోడ.

౨

గీ. అకట ! నీవొక్కఁడవగాక యపరయమున
మహిషవాహను సంక్రాంతి మానుముఁగొని
వచ్చితివి; యగ్నిగాడ్పుల భాతిమీర
వేమిగావింతొయని చిత్త మెరియుచుంటి.

3

గీ. నలుగురికి మంచివాఁడవై మెలఁగికొమ్ము
చేయకుము హేయముల నాకతాయిపనులు
ఏలమానుదువు 'విరోధి' యీకునన్న
తమ్ముఁడు 'ఖరాబ్ద' మట ! భవత్ప్రకృతి వికృతి

౪

కం. గుడజిహ్వాన్యాయంబున
గుడమిశ్రముచేఁదు మాకుఁ గొమ్మనుచుఁ జా
ఇడితివి వికృతీ ! జనముల
యొకలికి నేమేమివికృతు లుద్భవమగునో !

౫

కం. నీప్రకృతి మార్చుకొని లో
కోపకృతి ఘటిల్లఁజేయుచుండుము నిన్నుం
జేపట్టును లోకంబును
శ్రీపబ్బా శంకరయ్య శ్రేష్ఠియు మరియున్.

# పల్లా దుర్గయ్యగారు, ఎం. ఏ.,

## హైదరాబాదు

౧

సీ. చిరకాల ధూళిధూ సరితాత్మ మందిరాం
తరములు దుడిచి చిత్తరువులుంచి,
నిరతయాతాయాత నిష్ఠుర పదహతి
పసచెడ్డ కడపల పసుపుపూసి,
సతతబాల్యవినోద సక్తహస్తాంకితా
వరణభిత్తిక సుధావారిచిలికి,
గళితమాంగల్య దుర్గమ సీమలనుబోలు
ప్రాంగణమ్ముల రంగవల్లికలిడి

గీ. ద్వారములయందు పచ్చని తోరణములు
కట్టి, శుకపికశారికా కలకలముల
కంఠములు మేళవించి స్వాగతములిందు
వచ్చి నిలచినవిదిగో! సంవత్సరాది.

౨

మావిపిందెలువేసి సంబరముదెలిపె
చేదుగురిసెడి వేము పుష్పించిమించె
తింత్రిణీవృక్షములు పండి తియ్యనయ్యె
ఆంధ్రులెదమెచ్చి 'పచ్చడి' యారగింప

౩

సీ. శిశిరవాతోద్ధూత శీర్ణపర్ణాళియై
మోడువారిన వృక్షములు చిగిర్చె,
విగతపుష్పరజః ప్రవృత్తితో మెలగిన
కొమ్మలు ప్రసవించి కొమరుగాంచె,
వనవీథులందు మవ్వపుపువ్వు వెండిగి
న్నెలు తొలంకి తొలంకి పన్నీరుచిలికె,
పూర్వవాసనలెల్ల పుడికిపుచ్చుకొని గం
ధవహుండు దిక్కుల దాడివెడలె,

గీ. క్రమకలకంఠభృంగ మంగళనినాద
వాద్యములుమెఱసె, ప్రకృతి యపారశోభ
గాంచి మిసమిసలాడుచు గానవచ్చి
'వికృతి' పేర 'ఉగాది' యై వెలసెనేడు.

౪

గీ. ప్రకృతిసర్వము 'వికృతి' సంపర్కమంది
పచ్చపచ్చగ కన్నుల పండువయ్యె
మధుర కట్వామ్లమిశ్ర నింబప్రసాద
భక్షణముసలిపి నూతన బలులుకందు.

౫

వికసితసూనవాటికల వెచ్చనితేనియలాను షట్పద
ప్రకరనినాదముల్ చెవులపండువొనర్పగ, మావిగున్నలన్
పికములు పంచమశ్రుతిని వేడుకపాడగ మెచ్చివచ్చు ఈ
'వికృతి'నిగాంచి సిగ్గుపడివీఁగె 'విరోధి' నిశాతమస్సునన్.

౬

పోయెడుగాక! పాతపడిపోయిన కాల 'విరోధి' తోడనె
హేయములైన జాతిమత హేతుకఘాతుకహేతువాదముల్
మాయపుకృత్యముల్ పనికిమాలినబూటకనాటకంబులున్
చేయినిచేయిగల్పి, పెరచేతను జేబులుపుణ్కు బేరముల్.

౭

చాటుబజారుబేరము, వి
షాదపు మారణహోమముల్, నిరా
ఘాట ప్రవర్తనల్, కలియు
గ ప్రళయంబొనరించు యుద్ధముల్
కాటకముల్ విచారకర
కార్యము లాకలి కాపుమంటలున్
నెటిదినమ్మునుండి యువ
నిష్ఠలివీడి తొలంగుగావుతన్.

౮

తరతమభావముల్ వికట
తర్కము, నిల్కడలేనియూహమున్
విరసపుమాటలున్, కపట
వేషము లుల్లములోనలేని ద
బ్బరపునయంబులున్, మిడిసి
పాటును, కోపము తాప మీర్ష్యయున్
పిరికితనంబు మమ్ములను
విడుత ఈశుభ వాసరమ్మునన్.

౯

తరములనుండిపొందెడి వ్యా
థల్ నశియించుత, స్వార్థవాసనా
పరులగువారిచిత్తములు
పాపభయంబును బొందుగాక, బా
హిరముగ సాగుచున్న నర
హింసల ధ్వంసమొనర్చి ధారుణిన్
స్థిరతర శాంతివంతముగ
జేసి 'ఉగాది' శుభంబొసంగుతన్.

౧౦

అచ్చపుదేశభక్తి, కులమందభిమానము, జాతిసంపదన్
పెచ్చొనరించుసేవ, తమ వేషములందును భాషయందునన్
హెచ్చినప్రేమ, సోదరులహీనదశన్గని బాష్పబిందువుల్
పుచ్చెడిమేల్గుణంబులను పొంపిరిపోవునుగాక జాతిలో.

౧౧

శ్రీరామా మణి కరుణా
ప్రారంభమునన్ శతాయు రైశ్వర్యంబుల్
"శ్రీరామా బుక్కుడిపో"
గారికి 'శంకరయ్య' కిడు 'ఉగాది' శుభంబుల్.

---

## గాదిరాజు యజ్ఞనారాయణరావుగారు

సికింద్రాబాదు

౧

శ్రీల దులదూగునట్టి పొం, కాలుపబ్బ
శంకరయుశ్శోభికబ్బె తుశంకలేని
మనిషిగావున వాగ్దేవి మంచిచెడ్డ
లరసి నడపించు లోనాల్కా నాశ్రయించి.

౨

నూతనవత్సరాదియని
యూరక వాగ్వృత్తిసేయకుండ ముం
జేతిని కంకణంబిడిటు
జేసెను శారద గారవించి సం
ఘాతిశయంబు లిప్పుడిల
గాగరచించెను లక్ష్మిపూజ ప్ర
ఖ్యాతిగలుంగ శంకరయ
కాలము లచ్చి యొఱాతలూగుతక్.

3

విద్దెలకురాణి వాణిని విశ్వసించి
గొలుచు శంకరుకయిగూర్చి పలుకులందు
మంచిమర్యాద యోచించు మాటగనుక
సతము వాగ్దేవినిలుచు సుస్వాంతయగుట.

---

## శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు

హైదరాబాదు

౧

సీ. పలువన్నెలకాడేలు నలరుడండలఁగూర్చి
సిరిమించ సిగలఁ గైసేయుచుండి,
పూఁదేనెరసమును బొట్టపొంగునఁ ద్రావి
సొగసునూయాలాల నోలఁజేసి
గండుకోయిలపిండు మెండైనతియ్యని
పాటలఁబాడుచు బ్రమియఁజేసి.
చిగురు సెజ్జలఁగూర్చి చెలిమిసేయుచు నెల
కొమ్మల నెలమి జోకొట్టుచుండి,

తే. గీ. లంకతెమ్మెర వంకాల బొంకముగను
గొలువుచేయుచు నామాని కొలువుకాఁడు
పూవుతోఁటల సిరికన్నెఁ బొలుపుమీఱ
వెలయఁజేయుచు జగమెల్ల వెలయఁజేయు.

౨

—॥ చంపకమాలిక ॥—

జిలిబిలిముద్దుపల్కులును,
జేవలుదీరిన యర్థసంపదల్
దలఁపులతేనియల్ రసను
ధామధురత్వముఁ గల్గునట్లుగాఁ

వెలుఁగు సరస్వతిఁ గొలుచు
ధీరకవీంద్రులు గల్గినట్టి యీ
పొలమున వైభవంబు కడు
పోడిమి వీడుచునుండె నన్న! నీ
కులమున బుట్టినట్టి కవి
కుంజరబీజము లాఱకుండఁ బా
దుల నెలకొల్పి నీరిడుచు
దోహదముల్ జతగూర్చి పెంచి కో
మలతర పత్రపుష్పఫల
మండలమండిత పండితప్రకాం
డలలిత ధారుణీతత వి
టంకతలంబున మేలుబంతిపై
యలరుచుఁ, భావరాజు బుధు
నప్పకవీంద్రుఁ, గవీంద్రవర్యుఁ బి
ల్లలమర్రిఁ బోతనార్యుని స
లక్షణనిర్మిత సత్ప్రబంధ ద
క్షుల మన సాహితీపితల
శుద్ధరసాంజలిఁ దృప్తి సేయఁగా
వలయుఁగదయ్య! మాటికిని
వ్యర్థపుమాటల నాడుచుండి ని
స్తులమగు పూర్వవైభవము
సోత్రముచేసిన యంతమాత్రలోఁ
గలుగునదేమి సోదర! క
కావికలైన తెలుంగుసంస్కృతిఁ

నెలవుకొనంగఁ జేయుటకు
　　　　నిశ్చలచిత్తుఁడవౌచు సాహితీ
కళలను గొల్వఁగా సుదృఢ
　　　　కంకణబంధుఁడవౌచు వేడ్కతో
జిలువ పసిండికొప్పునగలు
　　　　చెల్వుగఁదీరిచి యాంధ్రభారతీ
లలన నలంకరించి పర
　　　　లౌల్యము మాన్పుచు సోదరాళికిన్
"దెలుఁగు తెలుంగెలెస్స" యని
　　　　దేశము నెల్లెడఁ జాటుమయ్య యున్
దెలఁగువిరోధికిన్ వికృతి
　　　　సేరె, విచారముమాని నీవు క
న్నులతెరలూడ్చి యంతటఁ గ
　　　　నుంగొను లెమ్ము తెలుంగుసోదరా!
పలుశుభసంపదల్ వికృతి
　　　　వత్సరమందున నీకుఁ గల్గెడిన్

౩

క. శ్రీలును, మేలిశుభంబు, వి
　శాలాంధ్రాహ్లాద, మవనిజనసన్నుతి, వి
　ద్యాలలిత సమాదరణం
　బాలంబను లగుత పుస్తకాలయమునకున్.

# చిగురుపాటి, ఆకెళ్ల సుబ్రహ్మణ్యజంటకవులు

## సికింద్రాబాదు

౧

శ్రీకరుణామయీ మధుర ప్రేమధునీ మముకన్నతల్లి నీ
రాకకునోచుకోని మణిరాగములో నొకవిశ్వశాంతి మా
కై కనుమోడ్పుదీయుము ముఖమ్ముల వేదనబాపి నేరుగా
నాకవితన్బొసంగెద ననాది ఉగాది నమస్కృతమ్మిదే

౨

తెలుగుపురాతనాద్యతన దేశవిశాల విధాన లేఖకుల్
తెలుగుకవీంద్రకోటికి నిదేకయిమోడుపు భక్తితోడుతన్
తెలుగుసరస్వతీకళల తేజము యీ తెలగాణసీమ సాం
ధ్రుల పరిషత్తునందు నిలతోషముతోడ జొహారులిచ్చెదన్.

౩

గంటలుమోగె దేవళ మొకానొకరూపున లోన నెవియో
మంటలురేగె భక్తులు అమాయికరోదనసేసె దుష్టులా
వెంటనెపీకె నాగుడి రవింజనె పశ్చిమతీరసీమ ము
క్కంటి పకాపకన్నగె వికారపులోకపధర్మదృష్టికిన్

౪

రాజకళాసరస్వతి సరాగముతో కవితావిపంచి రా
రాజుల మ్రోలబాడి మధురార్ద్రజనమ్ముల కిస్వతంత్రమౌ
మోజుసునూత్నవత్సర సుమోదయసాంధ్యవసంతశోభలో
రాజిల శాంతిధర్మము లరాతులపాల్పడకుండ బాడఁగా.

౫

సీ. బంగారుకైతల పండించె భారత
త్రయమును ధర్మపథాన తెలుగు
తెలగాణసీమ కోమల కావ్యకన్యక
సోమనాదికవుల నోముతెలుగు
శ్రీనాథ పోతనల్ జ్ఞానోదయము నిడు
చేల పచ్చని కైత జేరుతెలుగు
గురిజాడ చెళపిళ్ళ గురువులు నవయుగో
దయ కవితాశ్రుతి తీయుతెలుగు
గీ. దేశభాషలలోపల తెలుగులెస్స
అన్న రాయలకవిసూక్తి విన్నకవులు
తెలుగుభాషామతల్లికి వెలుగునొసగె
అట్టి కవులకుగాదె జే వెట్టిమ్రొత్తు.

౬

అణువకుశక్తియున్నదని ఆత్మకు లేదనిపల్కు దేశమే
గణనకురాదు హైమగిరి గాంగతలంబున శీతలంబు యీ
మణిమయభారతమ్మున కమాయకులైన ప్రజాళిరక్తమే
పణమగునా! అహింసకు అభంబౌ శుభంబౌ ఉగాదిదేల్పుతన్.

౭

గిరిశిఖరంబునుండి పరికించినచో సెలయేటివాలు పూ
దరువులజారి సిగ్గున సుధామయికిం దెలవారునట్లు సం
బరమున శాంతిగన్నె కనుపంపుల తీయనిపాటనాటి రా
చరికము చారతేమరచి సత్యయశమ్ము నుగాదినిల్పుతన్.

౮

సీ. శిలలుద్భవించిన శిల్పసాక్షాత్కృతి
నాగార్జునంబున నాట్యమాడ
హిమగిరిసీమల కమనీయచిత్రాలు
అమరావతీస్తూప మేముడంచ
బొమ్మలుచెక్కిన చెమ్మగిల్లినకండ్ల
కొండపల్లియ కుంచెకుట్టులూర
వేయికంబాలలో వేదరూపాళిని
పూజించు ఓరుగల్ పుడమిమెరయు
గీ. ఎంతొచక్కని ముద్దుల వింతకట్టు
ఎల్లలోకాలు చూచిన తెల్లవోవ
అమరమయసృష్టి ఆంధ్రుల కలరయిడిన
నాతెలుగుశిల్పికి ఉగాది నమసులివిగొ.

౯

సీ. ప్రళయమేఘమురీతి పరుగెత్తుచున్నది
యాటముబాంబుల అగ్నిధార
స్వార్థదేశాలన్ని సమరసన్నాహమై
హడలెత్తుచున్నవి అంధమతుల

కుత్సితద్వేషాల కుళ్లుహృదయాలతో
మానవవ్యాఘ్రాలు మండుచుండ
దారిద్ర్యరాక్షసి దౌర్జన్యగాథలు
మతవిరోధపిశాచి మసలజేయ
గీ. అల్లకల్లోలమంతయు ననగలేదు
అఖిలభారతశాంతి విహారమేది
దుష్టశిక్షణ వికృతిరో ! దోవజూపి
సతత శాంతిసుఖములు విశాలమగుత.

౧౦

సీ. నీవంటి సహృదయుల్ నిలచిధర్మపథాన
నిరుపేదలకు దారి నెంచవలెను
నీవంటిరసికులు నేర్పుతో ఆంధ్రస
రస్వతి కందమై రాగవలెను
నీవంటి పోషకుల్ నిర్మలభక్తితో
ఆంధ్రకవీంద్రుల నరయవలెను
నీవంటి వణిజులు నిష్పక్షపాతాన
ఆర్థికబాధల నణచవలెను
గీ. పుట్టినావు పబ్బాన్వయమునను నీవు
పట్టి రామాబుకుడిపోను భాగ్యమలర
నీలరాజయు అండగా వెలిగుసుఖము
శంకరశ్రేష్ఠి కవిషండితాంక మణిగ.

శ్రీ

# ఉగాది ఉత్సవము

:o:

ఖర సంవత్సరాది

**7—4—1951**

★

అధ్యక్షులు :

కవిసమ్రాట్

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు

★

కార్యకర్తలు :

## శ్రీరామా బుక్ డిపో,

విద్యావిషయుక పుస్తక ప్రచారకులు.

మార్కెట్ స్ట్రీట్ — సికింద్రాబాదు.

కుత్సితద్వేషాల కుళ్లుహృదయాలతో
మానవవ్యాఘ్రాలు మండుచుండ
దారిద్ర్యరాక్షసి దౌర్జన్యగాథలు
మతవిరోధపిశాచి మసలజేయ
గీ. అల్లకల్లోలమంతయు ననగలేదు
అఖిలభారతశాంతి విహారమేది
దుష్టశిక్షణ విక్రుతిరో! దోవజూపి
సతత శాంతిసుఖములు విశాలమగుత.

౧౦

సీ. నీవంటి సహృదయుల్ నిలచిధర్మపథాన
నిరుపేదలకు దారి నెంచవలెను
నీవంటిరసికులు నేర్పుతో ఆంధ్ర స
రస్వతి కండయై రాగవలెను
నీవంటి పోషకుల్ నిర్మలభక్తితో
ఆంధ్రకవీంద్రుల నరయవలెను
నీవంటి వణిజులు నిష్పక్షపాతాన
ఆర్థికబాధల నణచవలెను
గీ. పుట్టినావు పబ్బాన్వయమునను నీవు
పట్టి రామాబుకుడిపోను భాగ్యమలర
నీలరాజయ అండగా వెలగుసుఖము
శంకరశ్రేష్ఠి కవిపండితాంక మణిగ.

శ్రీ

# ఉగాది ఉత్సవము

:o:

ఖర సంవత్సరాది

## 7—4—1951

★

అధ్యక్షులు:

కవిసమ్రాట్

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు

★

కార్యకర్తలు:

శ్రీ రామా బుక్ డిపో,

విద్యావిషయిక ప్రచారకులు.

మార్కెట్ స్ట్రీట్ — సికింద్రాబాదు.

# ఉగాది

ఖర ఉగాదిసందర్భమున సికింద్రాబాదు మార్కెటు వీథిలోని శ్రీరామా బుక్ డిపో వారి యాజమాన్యమున చైత్ర శు॥ ౧ శనివారము ఉదయము వారి దుకాణము వద్ద శ్రీ లక్ష్మి సరస్వతీ పూజ జరుపబడెను. పురప్రముఖులు, పండితులు, పలువురు విచ్చేసి సన్మానితులైరి. ఆనాటి సాయంకాలము కింగ్సువేలోని రావుసాహెబు బూరుగు మహదేవశ్రేష్ఠిగారి ధర్మభవనమున ఉగాదిగోష్ఠి జరుపబడెను. సాహితీసమితి కార్యదర్శియగు కవిసమ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారు అధ్యక్షత వహించిరి. దైవప్రార్థన, స్వాగతము, అయినపిమ్మట అధ్యక్షులవారు సాహిత్యమును గురించి తమ ప్రారంభోపన్యాసమున వివరించిరి. సాహిత్యమనగా సహితభావమనియు, ప్రకృతిలో గల నిర్మాణశక్తి, వినాశకశక్తి, రెంటిలో మొదటిదగు నిర్మాణశక్తికి సంబంధించి, ప్రపంచమందలి భిన్నపద్ధతులను సమన్వయ మొనర్చి సామరస్యము కలుగజెయునట్టిదియే సహితభావ సంపన్నమగు సాహిత్యము కాగలదనియు, మిగిలినదంతయు వినాశాత్మకమైనందున సాహిత్యము కాజాలదనియు, అధ్యక్షులు బోధించిరి. తరువాత వారు వేదమెట్లు సాహిత్యమగునో వివరించి, వేద వేదాంగములకు గల పరస్పరసంబంధమును వర్ణించి, అందు

ప్రకృతము ఉగాదిపై జ్యోతిశ్శాస్త్రమునకుగల ప్రభావము ను విపులీకరించి పంచాంగశ్రవణ ప్రాముఖ్యతను సిద్ధాంతీకరించిరి.

పిమ్మట శ్రీ భీమపరపు సాంబశివశర్మగారిచే పంచాంగశ్రవణము జరుపబడెను. తరువాత శ్రీ ఓరుగంటి నరసింహయోగిగారిచే మాతృభాషయగు సంస్కృతమున సాహిత్యమునుగూర్చి ఉపన్యసింపబడెను. ఆధునికులు ఋషులు కానందున వారికి కావ్యనిర్మాణాధికారము "నానృషిఃకురుతే కావ్య" మ్మను సూక్తి చొప్పున లేనేలేదనియును, అందుచే ఘనతరమైన పురాతనగ్రంథములను పఠించి తరింపుటయే నేటివారికి కర్తమనియును, రష్యా మున్నగు దేశములచేగూడ బహుశః ప్రశంసింపబడిన రామాయణాది ఆదర్శకావ్యము లవశ్య పఠనీయములనియును, శ్రీ యోగిగారు సెలవిచ్చిరి.

తదనంతరము శ్రీ కె. సూర్యనారాయణశర్మగారిచే వ్యంగ్యప్రధానమును, ప్రస్తుత రాజకీయాది వివిధ వాతావరణ విమర్శనాత్మకమును, అగు "రాద్ధాంత పంచాంగ శ్రవణము" జరుపబడెను. ఆ పిమ్మట ఈ క్రిందికవులచే ఉగాదినిగూర్చి కమ్మని కవితాగాన మొనర్పబడెను.

శ్రీ నల్లాన్ చక్రవర్తుల శ్రీనివాస పార్థసారధిగారు.
శ్రీ బలభద్రపాత్రుని కృష్ణారావుగారు.

శ్రీ ఉప్పల చంద్రశేఖరంగుప్తగారు.
శ్రీ వారణాసి వెంకటసుబ్బారావుగారు.
శ్రీ చిల్లర భావనారాయణరావుగారు.

ఇంకను కొందరుకవులు ఆహూతులయ్యు రాజాలక పోయిరి. పిదప అధ్యక్షులుకూడ తమ మృదుమధుర కవితాగానమును సభ్యులకు వినిపించిరి. తమ దేవీభాగవతమునుండి కొన్నిఘట్టములు సభ్యుల కోరికపై చదివి వినిపించిరి. కవితాగానమొనర్చిన కవులను, అధ్యక్షులవారిని యథాశక్తిగా శ్రీరామా బుక్‌డిపో వారు సన్మానించిరి. కృతజ్ఞతాపూర్వక వందనములతో సభ జయప్రదముగా సమాప్తమయ్యెను.

## వుప్పల చంద్రశేఖరగుప్తగారు

### సికింద్రాబాదు

౧

శ్రీరంజిల్ల విశేషసౌఖ్యముల సంసేవించు రామామనో
హారిన్‌గూడి, సుఖాళిదేలి, సుమనోహరుండునై భక్తులన్
గారాభంబునబ్రోచుశ్రీహరుఁడు, మేల్ గల్గంగ సౌఖ్యాబ్ధినిం
పారన్ యీఖరనూత్నవత్సరమునన్ భవ్యత్వముల్
గూర్పుతన్.

౨

శ్రీకరమౌ వసంతమిదె, జేకురెమామిడి లేజిగుళ్ళికన్
నీకడుపారగ్రోలి తమినించెడు నీడగు 'కూకు!' నిస్వనిన్
ప్రాకటమంజులారవము భవ్యతనొప్ప శుభాభిలాషలన్
కోకిల! పాడవే మధురిగూర్పగ నీఖర నూత్నవత్సరిన్.

3

సీ. పల్లెపల్లెలగల్గు పాడిపంటలు కడు
వృద్ధియై సుఖములు వరలుగాక
కరువురోజులుదీరి కంటకప్రాయమౌ
షుద్దుకంట్రోలులు బోవుగాక
అన్నమోయంచను యాకలిబాధల
మాడి చచ్చెడిరీతి మానుగాక

బ్లాకుమార్కెట్లతో ప్రజలదోపిడిజేయు
స్వార్థబుద్ధులుగూడ సమయుగాక
జనులు సదాచార చరణులై యైక్యత
గూడగా సుఖములు గూడుగాక

గీ. సకల కళ్యాణమయమౌచు జనులకెల్ల
అమర ఆనందవీచిక లమరజేసి
సర్వసౌఖ్యాభివృద్ధుల జేర్చుగాత
యిప్పుడీ ఖరవత్సరం బింపుమీర.

౪

గీ. భారతావని స్వాతంత్ర్య పదముగల్గి
దనరవచ్చెను మూడు వత్సరములిపుడు
కరువుకాలంబు గట్టెక్క గలుగలేదు
కట్ట ! దైవంబు దయజూడ గలుగునెపుడొ ?

౫

గీ. లలితకళలందు సకల శాస్త్రాలయందు
మమత లోకాన మకుటాయమానమగుచు
మెలగు భారతమాతృమతల్లి ప్రజలు
వరల సుఖమందుగాక యీ వత్సరమున.

౬

క. నిరతము శ్రీరామామణి
కరుణను సమకూర్చుసుఖము కల్యాణముతో
సిరిగల్గు శంకరయ్యకు
సిరియొసగుచు మిగులప్రేమ జెలగగనెపుడున్.

౭

గీ. వరల శ్రీరామ బుడ్డిషా వనిత, దలప
పంచవింశతివత్సర ప్రాయయయ్యె
ఇపుడు నూతనవర్షంబు ఎదుగవచ్చె
గూర్చు సిరియెల్ల ఈ యేడుగూడ నిజము

౮

శ్రీకర వైశ్యవంశకుల శే
ఖరుఁడార్యుఁడు శంకరాఖ్యుఁడో
హా! కడుగూర్చుతండ్రి యిక
నొందకుమమ్మ విచారమేమియుఁ
శ్రీకుల రామబుక్కడిషా !
జెన్నుగ సంపదలెల్ల గల్గగా
ప్రాకటరీతినీవు శత వ
త్సరముల్ సుఖియింపు మమ్మరో !

---

## బులుసు (?) బలభద్రపాత్రుల కృష్ణారావుగారు

హైదరాబాదు

౧

కోకిల కలకలములతో
ప్రకట సుకవీంద్రమధుర పద్యాళులతో
నేకముగ జగము తేనియ
వాకసలుపు శంకరులకు బ్రస్తుతియసదే.

౨

ధర్మనిబద్ధబుద్ధియయి తత్త్వమహత్త్వ విశిష్టదృష్టియై
నిర్మలచిత్తవృత్తియు వినీత పవిత్ర చరిత్రముఁ దగఁ
గూర్మిదిగంత కాంత కవికోకిల నవ్యవసంతమూర్తియై
ఆర్మిలినించుశంకరుడ నన్యసుధన్య పదమ్ములందుతన్.

3

శ్రీరామా బుకు(?)డిపో
పారంపర్యాభ్యుదయము బడయునుగాతఁ
ధీరుడు పబ్బాశంకరు
డారోగ్యాయుస్సమృద్ధు లందెడుగాతఁ !

## శ్రీనివాససోదరులు శతావధానులు

సికింద్రాబాదు

౧

గీ. ఈ యుగాదిమహత్త్వ మదేమొకాని
ఎంతటి వికీర్ణహృత్పేటినేని ఇట్టె
నవనవోన్మేష చైతన్య మివురుకొనగ
నిత్య నూతనదీప్తి నిండింపచేయు.

౨

ఉ. సారెకు నగ్రరాజ్యముల
స్వార్థపిశాచము లాపియాపయిఁ
స్వైరవిహారముల్ సలుప
సాగిన వందుకు త్రోసిరాజుగా
భారతరాజనీతి గురు
పాఠము చెప్పక తప్పదింక మే
లారసి మాదుజాతిని స
మైక్య మొనర్పగదే ఖరాబ్దమా !

3

మ. అపహాస్యంబుల పాలుగావుటకు ల
క్ష్యంబౌ ముతారాజకీ
యపు డొంకంబడి డింక గొట్టుటలు నూ
హాగానముల్మాని యై

క్యపథంబుఁ సరిదిద్దుకొంచును విశా
లాంధ్రమ్ము సాధించు శ
క్తపరాకాష్ఠనుజూప చల్లని యుగా
దిఁ దీక్ష గైకొందగుఁ.

౪

ఉ. కేవల లాభనష్టములు
క్రిందును మీదు గుణింపనట్టి వి
ద్యావిషయ ప్రచారక ప
దంబున కర్దమొసంగగల్గు వా
తావరణం బెలర్చెడిగ
దా కవి పండితగోష్ఠి; ఇట్టిదీ
డౌవిధి శంకరయ్యకృషి
సాగెడిగాత మితోధికంబుగఁ.

౫

చ. నిరుపహతిస్థలంబు రమ
ణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
ప్పురపువిడెంబు మున్నయిన
భోగములం బ్రభవించుకైత క
కు్రరితియెగాని కూటికిని
గుడ్డకు మోములువాచి యున్నము
ష్కరమగు నేటికాలమున
చక్రదనాలు రచింపగల్గునే!

## నోరి నరసింహశాస్త్రిగారు

★ రేపల్లె

౧

శ్రీరూపంబున సర్వభూతతతి సుస్నిగ్ధస్థితిం బొల్పుచున్
శ్రీరాగంబయిశబ్దలోకమును సంజీవింపగాజేయుచున్
శ్రీరాజిల్లు సువాసినీజనుల వాసింగాంచి ప్రత్యక్షమై
శ్రీరామాహ్వయమూలశక్తి శుభముల్ చేకూర్చుగాకెప్పుడున్.

౨

మరచి సమస్తముఁ నిదుర
మ్రాన్పడియున్న యనంతజీవులఁ
కరముల మెల్లలేపుచును
గ్రమ్ము తమమ్ము దిగంతభూమికిం
బరపుచు జ్ఞానదీప్తుల బ్ర
పంచము నింపుచు లోకపూజ్యుడౌ
ఖరకరునట్లు మిత్రుఁడగుగావుత మీ
ఖరకాల దేవుడుఁ.

౩

మ్రానులిగిర్చి పూసినవి మా
వులు ఝుంకరణీంకృతిం బరా
గానముచేసె బంభరము కమ్ర కు
హూశ్రుతి కోకిలందు ని
క్వాణమొనర్చె! నీ ప్రకృతి
కాంత సనాతన దివ్యయౌవ కా
ధానము శ్రీయు నాయువు స
దాయొనగూర్చుత సజ్జనాళికిఁ.

---

వారణాసి వెంకటసుబ్బారావుగారు

సికింద్రాబాదు

## ★ ఉగాది ★

స్వతంత్రభారత
పతాకనీడను
త్యాగముదాల్చను
మూగతనంబదె
పట్టిపగ్రతియు
ఖందిపోటులకు
స్వార్ధజీవులకు
పదవులబ్బనీ
''వికృతి'' కెప్పుడు
నికృతియోయని
విసుగుజనించెను
జనులకెల్లెడను
''ఖర'' కర తీక్షత
కరభరతాపన
నిలయముగావుత
నిరతసౌఖ్యముల.

* * *

ప్రజాస్వామ్యమున
ప్రజాపీడితుల
క్షుధాబాధితుల
వస్త్రవిహీనుల
నిరక్షరాస్యుల
నిత్యదరిద్రుల
"వికృతి" పోరగ
"ఖర" కర తీక్ష్ణత
కలభరతాపస
నిలయముగావృత
నిరతసౌఖ్యముల.

సంపూర్ణము.

"దివ్యవాణి" పత్రికవారి
శ్రీనివాసా ప్రింటింగువర్క్సు, సికింద్రాబాదు.